# ట్రేడ్ యూనియన్లు : వలసవిధాన అంత్యదశ





ఎస్. ఏ. డాంగే



# ట్రేడ్ యూనియన్లు: వలసవిధాన అంత్యదశ

[1957 అక్టోబరు 4 నుండి 15 వరకు లీప్జిగ్ (తూ. జర్మనీ)లో జరిగిన నాల్గవ ప్రపంచ ట్రేడ్‌యూనియన్ మహాసభలో శ్రీ ఎస్. ఎ. డాంగేచే ప్రవేశపెట్టబడి ఆమోదింపబడిన నివేదిక]

ఎస్. ఎ. డాంగే

అనువాదం : కంభంపాటి సత్యనారాయణ

విశాలాంధ్ర ప్రచురణాలయం, విజయవాడ.

ప్రచురణ నెం. 261
ప్రథమ ముద్రణ :
మార్గశిరం, 1879
(డిశెంబరు 1957)

ముద్రణ :
స్వతంత్ర ఆర్టు ప్రింటర్సు,
విజయవాడ.

వెల : రు. 0.62.

3

# విషయసూచిక



5

# 1

# జాతీయ స్వాతంత్ర్యంకొరకు, ఆర్థికాభివృద్ధికొరకు జరిగే వలస విముక్తి పోరాటాల వెల్లువ

ఆధునిక యుగంయొక్క అత్యంత ప్రధానమైన లక్షణం కోట్లాది వలస-అర్ధవలస దేశాల ప్రజలు నిద్రనుంచి మేల్కొనడం.

ప్రపంచ చరిత్రలో చాల పవిత్రమైనవిగా ఎంచబడే దేశాలు, అత్యంత శక్తివంతమైన ప్రాచీన జాతులు, సిరిసంపదలకూ సాంస్కృతిక వికాసానికీ ఆలవాలమైన దేశాలు, ప్రకృతి సంపదకు మానవసంపదకు కేంద్రాలైన దేశాలు — చైనా, భారతదేశం, అరబ్బుదేశాలు, సువిశాలమైన ఆఫ్రికాఖండం, అసంఖ్యాకమైన దక్షిణఅమెరికా రిపబ్లిక్కులు — కొత్త ప్రభుత్వాలక్రింద కఠోర దాస్యం అనుభవించాయి.

18, 19 శతాబ్దాలలో జరిగిన పారిశ్రామిక విప్లవాల ఫలితంగా ఉద్భవించిన బలీయమైన పెట్టుబడిదారీ రాజ్యాలు, ఉత్పత్తిరంగానికి యుద్ధాలకూ ఉపయోగపడే సరికొత్త సాంకేతిక పద్ధతులను చేబట్టి, ముడిసరకులకోసం మార్కెట్లకోసం మనుష్య బలంకోసం అంతులేని ఆశతో అతిప్రాచీనమైన దేశాలను, ఖండాలను ముట్టడించాయి; ఇంగ్లండ్, ఫ్రాన్స్, జర్మనీ, అమెరికా మొదలైన దేశాల గుత్తపెట్టుబడిదార్లకు లాభాలు సంపాదించి పెట్టే దేశాలుగా వాటిని మార్చివేసుకున్నారు సామ్రాజ్య వాదులు. ఈ కోటానుకోట్ల ప్రజల్ని అమానుషమైన వలస

దోపిడీకి గురిచేసి, వారిమీద అనేక శతాబ్దాలు పెత్తనం చెలాయించారు.

కాని వారిలోవారికి దోపిడీ ఆస్తిని పంచుకోవడంలో పేచీలు వచ్చి, ఒకరిమీద ఒకరు యుద్ధాలు చేసుకున్నారు. ఇతరుల్ని బానిసత్వంలో బంధించనిదే. చివరకు ఒకరిమీద ఒకరు యుద్ధాలు చేసుకోనిదే పెట్టుబడిదారీవ్యవస్థను వారు కాపాడుకోలేకపోయారు.

అలాంటి ప్రతియుద్ధం బానిసదేశాలకు ఒక అవకాశంగా, సామ్రాజ్యవాదుల పెత్తనంనుంచి విముక్తిచెందడాని కొక చక్కని అవకాశంగా పరిణమించుతూ వచ్చింది.

1914 లో ప్రారంభమైన మొదటి ప్రపంచయుద్ధం అక్టోబరు విప్లవానికి దారి తీసింది. జార్ చక్రవర్తుల సామ్రాజ్యంలో వలస దోపిడీకి లోనయే ప్రాచీన జాతుల ప్రజలు—మంగోల్, కజాక్, ఉజ్బేక్ తదితరజాతుల ప్రజలు—స్వాతంత్ర్యమార్గం చేబట్టడానికి, సోషలిస్టుమార్గం చేబట్టడానికి ఆవిప్లవం గొప్ప అవకాశమిచ్చింది.

ఇండియా, చైనా, మధ్య ప్రాచ్యదేశాలు (ఈజిప్టుతోసహా) జాతీయ స్వాతంత్ర్యంకొరకు అద్భుతమైన పోరాటాలు జరపడానికి కూడా అది వీలు కలిగించింది. అక్టోబరు విప్లవం, సోవియట్ ప్రభుత్వం వాటికి ప్రోత్సాహమిచ్చాయి; అవి మరింత ముందుకు పోవడానికి సహాయం చేశాయి.

సామ్రాజ్యవాద దుండగులు బానిసదేశాల సహజసంపదనూ మనుష్యబలాన్నీ దోచుకొనేందుకై ఫ్యాక్టరీలను, వర్క్‌షాపులను, గనులను, రైల్వేలను స్థాపించవలసివచ్చింది; సమాజంలో పెట్టుబడిదారీ సంబంధాలను ప్రవేశపెట్టవలసివచ్చింది; తత్ఫలితంగా అయాదేశాల ప్రాచీన ఆర్థికవ్యవస్థలు సర్వనాశనమయాయి. అంతేకాదు. కొన్ని కొత్తవర్గాలను వారు సృష్టించవలసివచ్చింది. కార్మికవర్గాన్ని వారు సృష్టించారు; మధ్యతరగతివర్గాన్ని సృష్టించారు; జాతీయ పెట్టుబడిదారీవర్గాన్ని సృష్టించారు. పెట్టుబడిదారీ సామ్రాజ్యవాద వ్యవస్థయొక్క ప్రతిసంక్షోభదశలోను పరాధీన

దేశాల ప్రజలు తిరుగబడుతూనే వచ్చారు. ఆ పోరాటాలు తరచు అణచివేయబడినప్పటికీ సామ్రాజ్యవాద వ్యవస్థ ప్రతిసారి మరింత తీవ్రమైన సంక్షోభానికి లోనవుతూ వచ్చింది.

రెండవ ప్రపంచయుద్ధం తర్వాత ఆసియా, ఆఫ్రికా, లాటిన్ అమెరికాలలో జరిగిన వీరోచిత పోరాటాలు అద్భుతమైన విజయాలను సాధించాయి. మొదటి ప్రపంచయుద్ధంతర్వాత జరిగిన విప్లవాలు, తిరుగుబాట్లు విఫలమైనట్లుగా రెండవ ప్రపంచయుద్ధం తర్వాత విఫలం కాలేదు.

చైనా మహావిప్లవం 60 కోట్ల ప్రజల్ని సామ్రాజ్యవాదం నుంచి విముక్తి చేయడమేగాక, వారిని సోషలిస్టు మార్గంలోకి తెచ్చింది. ఉత్తరకొరియా, వియత్‌నామ్‌ల విషయంకూడా యింతే.

36 కోట్ల ప్రజలుగల భారతదేశం బ్రిటిష్ సామ్రాజ్యవాదంనుంచి రాజకీయ స్వాతంత్ర్యం సంపాదించుకొంది. డచ్చి ప్రభుత్వంనుంచి ఇండొనేషియా విముక్తి చెందింది.

వలసదోపిడీకి లోనవుతూవచ్చిన ప్రజల విముక్తి పోరాటం మరింత వేగంగా వ్యాప్తి చెందింది. అరబ్బుదేశాలలో జాతీయ వెల్లువ, ఐక్యతాభావం నూతన శిఖరాల నందుకొంది. ఆదేశాలు త్వరిత గతిని సామ్రాజ్యవాద పీడననుంచి బయట పడుతున్నాయి.

ఇంతకన్న ప్రాధాన్యం వహించే విషయం ఆఫ్రికా ప్రజలలో కానవస్తున్న నూతన జాగృతి. ఈ మహాఖండం అనాగరిక ప్రజలకు, అడవి జంతువులకు ఆటపట్టు అనీ, సామ్రాజ్యవాదుల ఫ్యాక్టరీలకు బానిసలను యిక్కడనుంచే పంపుతారనీ, వారి జంతు ప్రదర్శనశాలలకు అడవిమృగాలుకూడా యిక్కడనుంచే సప్లై అవుతాయనీ మనం సామ్రాజ్యవాదుల చారిత్రక గ్రంథాల్లో చదివాము. వజ్రపు గనులకు, బంగారు గనులకు పెట్టింది పేరు అదేనన్నారు. అన్నిటికంటె అగ్రస్థాన మియ్యాలని కాబోలు, సహారా ఎడారికూడా ఆఫ్రికాఖండంలోదేనని వారు తెలియజేశారు!

కాని యీ రోజున ఆఫ్రికన్లు స్వతంత్ర దేశాలలో స్వతంత్ర జీవితం గడుపుతున్నారు. సుడాన్, ట్యునీషియా, మొరాకో, ఘనాలలో స్వతంత్ర ప్రభుత్వాలేర్పడ్డాయి. ఒక్కొక్కప్పుడు వాటి అధికారాలకు పరిమితులు విధింపబడేమాట నిజమే. అయినప్పటికీ, ఆ దేశాల ప్రజలు తమ శాసనసభలను తాము ఎన్నుకొంటున్నారు; తమ ప్రభుత్వాలను తాము స్థాపించుకొంటున్నారు.

నీగ్రోలు నివసించే ఆఫ్రికా ఖండం నుంచి ఒక వ్యక్తి తన దేశం యొక్క బిరుదాంకితాన్నీ ధరించి సుదీర్ఘ దుస్తులతో లోనికి ప్రవేశించి స్వతంత్ర దేశాల ప్రతినిధుల ప్రక్కన ఒకే సమావేశభవనంలో కూర్చున్నప్పుడు పీడితజాతుల ప్రజలెంత గర్విస్తారు! సామ్రాజ్యవాదుల కదెంత కడుపుమంటగా ఉంటుంది!

లాటిన్ అమెరికాలో చాల దేశాలు రాజకీయంగా స్వాతంత్ర్యం పొందాయి. కాని సామ్రాజ్యవాదులు వాటిని ఆర్థిక దాస్యంలో బంధించి యుంచారు. అనేక రిపబ్లిక్కులలో అమెరికన్ ఆయుధాల, అమెరికన్ డాలర్ల సహాయంతో నియంతృత్వ ప్రభుత్వాలు పరిపాలన సాగిస్తున్నాయి. అవి అమెరికన్ గుత్తాధిపత్య సంస్థలకు సర్వవిధాల సహాయం చేస్తున్నాయి. ఖనిజాలు, పెట్రోలు, మొదలైన సహజ సంపద ఎక్కువగాలభించే విస్తారమైన ప్రాంతాలను వాటికి ధారాదత్తం చేస్తున్నాయి. రెండవ ప్రపంచ యుద్ధం తర్వాత గత పది సంవత్సరాల్లోను క్యూబా, కొలంబియా, వెనెజులా, పెరాగువా దేశాల ప్రజలు యిట్టి నియంతృత్వ ప్రభుత్వాలకు వ్యతిరేకంగా, అమెరికన్ గుత్త సంస్థల పెత్తనానికి వ్యతిరేకంగా ఎన్నో పోరాటాలు జరిపారు. మెక్సికో, బ్రెజిల్, ఆర్జెంటైనా వంటి పెద్ద దేశాలు తమ సహజ సంపదను, మనుష్య బలాన్ని అమెరికన్ గుత్తసంస్థలకు స్వాధీనం చేయడానికి నిరాకరించాయి.

ఈ విధంగా, రెండవ ప్రపంచయుద్ధంతర్వాత సామ్రాజ్యవాదం బలమైన దెబ్బలకు గురిఅయింది. ఇదివరలో సామ్రాజ్య

వాదానికి రిజర్వులుగా ఉపయోగపడే పెద్దపెద్ద వలసదేశాలు— ప్రతిసంక్షోభంలోను ప్రపంచ సామ్రాజ్యవాదానికి బాసటగా నిలబడే దేశాలు— ఒకదానితర్వాత ఒకటి కూలిపోతున్నాయి. ఆసియా, ఆఫ్రికా, లాటిన్ అమెరికాలలో కోట్లాదిప్రజలు సంపాదించుకొంటున్న రాజకీయ స్వాతంత్ర్యం ప్రపంచచరిత్రలో ఒక వాస్తవఘటనగా యీనాడు పరిణమించింది.

ఈ విషయం ఆసియా, ఆఫ్రికా ఖండాలకు సంబంధించి నంతవరకు 1955 ఏప్రిల్‌లో జరిగిన బాండుంగ్ మహాసభలో స్పష్టం అయింది. ఆసియా, ఆఫ్రికా దేశాల్లో జరిగిన యీ చరిత్రాత్మకమైన మార్పు బాండుంగ్ మహాసభ తీర్మానాల్లో వ్యక్తమైంది.

ప్రపంచ చరిత్రలో కనీ వినీ యెరుగని కొత్తబలంతో, కొత్తలక్ష్యాలతో ప్రాచీన దేశాల ప్రజ లీనాడు నిలబడ్డారు.

కొన్ని దేశాలు ఈమధ్యనే జాతీయస్వాతంత్ర్యం సంపాదించు కొన్నాయి; మరికొన్ని స్వాతంత్ర్య సంపాదనకై పోరాడుతు న్నాయి; ఇంకా కొన్ని యిదివరకే తాము సంపాదించుకున్న జాతీయ స్వాతంత్ర్యాన్ని రక్షించుకొనేందుకు, పరిపూర్ణమొనర్చు కొనేందుకు కృషిచేస్తున్నాయి. భారతదేశం పోర్చుగీసు ప్రభుత్వం నుంచి గోవాను తిరిగి సంపాదించుకొనేందుకు కృషిచేస్తోంది. ఇండో నేషియాను డచ్చి వలస దాస్యంలో బంధించియుంచేందుకు ఉద్దే శింపబడ్డ రౌండ్ టేబుల్ ఒడంబడికను ఇండోనేషియా ప్రభుత్వం రద్దుచేయడానికి నిశ్చయించుకొంది. మలయాకు శాసనసభ, స్వేచ్ఛాయుతప్రభుత్వం లభించాయి. ఆప్రభుత్వం స్వాతంత్ర్యాన్ని ప్రకటించుకొంది. అమెరికా ఆధిపత్యంక్రింద ఉన్న దక్షిణ కొరియా, దక్షిణ వియత్నాం, థాయ్‌లాండ్, ఫిలిప్పీన్స్ దేశాల ప్రజలు సైనిక కూటములకు స్వస్తిచెప్పాలనీ, అమెరికన్ సరకులను బహిష్కరించాలనీ, అమెరికన్ సోల్జర్ల విశేషాధికారాలను రద్దు చేయాలనీ డిమాండుచేయ నారంభించారు. అందుకై కృషిసల్ప

నారంభించారు. అమెరికన్ నౌకాదళంచే చుట్టుముట్టబడిన, స్వతంత్రభావాలు దరిచేరకుండా రక్షణ యేర్పాట్లు గలిగిన తైవాన్ దీవిలో సైతం ప్రజలు తిరుగబడి అమెరికన్ రాయబార కార్యాలయాన్ని ధ్వంస మొనర్చారు. ఈ ఘటన కెంతో ప్రాధాన్యం ఉంది. కారణ మేమంటే, సామ్రాజ్యవాదుల పొగరుబోతుతనానికి ప్రజలెంత ఆగ్రహం చెందుతున్నారో యీ ఘటన యావత్ప్రపంచానికి తెలియజేసింది.

ఎంతో చిన్న దేశమైన సైప్రస్‌లో బ్రిటిష్ సాయుధసేనలు జరుపుతున్న అత్యాచారాలకు వ్యతిరేకంగా ప్రజలు వీరోచితమైన పోరాటాలు జరుపుతున్నారు. ఏడెన్‌లోసైతం, ఎక్కడో మారుమూల ఒక తెగ నాయకుని క్రిందనున్న ఓమన్‌లోసైతం అరబ్బు ప్రజలు తమ సర్వశక్తుల్నీ ధారవోసి వలస విధానాన్ని ప్రతిఘటిస్తున్నారు.

ఆఫ్రికాలో ఆల్జీరియన్ ప్రజలు సాగిస్తున్న వీరోచిత పోరాటాలను అణచేందుకు ఫ్రెంచి సామ్రాజ్యవాదు లెన్ని అత్యాచారాలు జరుపుతున్నప్పటికీ ప్రయోజనం లేకపోతూంది. కీన్యా యిప్పటికీ పోరాడుతూనే ఉంది. దక్షిణాఫ్రికాలో జాతి విచక్షణకు వ్యతిరేకంగా ప్రజా ఉద్యమం విస్తృతరూపం దాల్చుతోంది.

ఆసియా - ఆఫ్రికా - లాటిన్ అమెరికా దేశాల ముందున్న సమస్యలను గురించి, ఆ దేశాల లక్ష్యాలనుగురించి, ట్రేడ్ యూనియన్ల కర్తవ్యాలను గురించి తెలుసుకోవాలంటే, ఈ దేశాలన్నిటినీ మనం రెండు ప్రధానమైన గ్రూపులుగా విభజించవలసి యుంటుంది.

మొదటి గ్రూపు: స్వాతంత్ర్యం సంపాదించుకున్న దేశాలు - ఉదా: ఇండియా, ఇండోనేషియా, సుడాన్, ట్యునీషియా, మొరాకో, ఘనా, మలయా మొదలైనవి—లేదా స్వతంత్ర ప్రభుత్వాలను కలిగియుంటూ, లాటిన్ అమెరికా దేశాల్లోవలె

సామ్రాజ్యవాదుల రాజకీయ ఒత్తిడికి లేదా కంట్రోలుకు లోనయ్యే దేశాలు.

రెండవగ్రూపు: రాజకీయ స్వాతంత్ర్యంకోరకు, జాతీయ సర్వం సహాధికారంకొరకు యింకా పోరాడుతున్న దేశాలు.

మొదటిగ్రూపుయొక్క సమస్యలూ రెండవగ్రూపు సమస్యలూ ఒకటికావు. ఐతే, రెండుగ్రూపులదేశాలూ ఆర్థికంగా వెనుకబడినయున్నవే. అందుచేత అవి వలసవిధానానికి వ్యతిరేకంగా పోరాడవలసిందే. కాని ఆ పోరాటం విభిన్నరూపాల్లో కొనసాగుతుంది.

రాజకీయ స్వాతంత్ర్యాన్ని కలిగియుండి, సర్వం సహాధికార ప్రభుత్వాలున్న దేశాల్లో—ఇండియా, ఇండొనేషియా, బర్మా, ఈజిప్ట్, సిరియా, లాటిన్ అమెరికాగ్రూపు— ప్రధాన సమస్య ఏమంటే, త్వరితంగా ఆర్థికాభివృద్ధి జరిగేందుకవసరమైన ప్రణాళికలను అమలుజరపడంద్వారా వలసదోపిడీయొక్క అవశేషాలను నిర్మూలించడం. ఈ దేశాలు తమ జాతీయస్వాతంత్ర్యాన్ని పటిష్ఠమొనర్చుకోడానికి, దారిద్ర్యంతో అలమటిస్తున్న ప్రజల స్థితిగతులను బాగుపరచడానికీ ప్రాతిపదిక యిదేనని చెప్పాలి.

కొత్తగా స్వాతంత్ర్యం పొందినదేశాల ప్రభుత్వాలు వెనుకబాటుతనం నుంచీ, పరాధీన స్థితినుంచీ బయటపడేందుకవసరమయే అభివృద్ధి ప్రణాళికలను తయారుచేసేటప్పుడు రెండు సమస్యలు ఆ దేశాల నెదుర్కొంటున్నాయి.

మొదటిసమస్య, యిప్పటికే సరకులను ఉత్పత్తి చేస్తూన్న జాతీయ పరిశ్రమలపై విదేశీ గుత్తపెట్టుబడిదార్ల పెత్తనాన్ని రద్దుపరచడం ఎలాగు - అనేది. సామ్రాజ్యవాదులు తమ క్రింద పరాధీనస్థితిలో వుంటూ వచ్చిన దేశాలకు రాజకీయ స్వాతంత్ర్యం యిచ్చివేయవలసిన పరిస్థితులేర్పడ్డాయి. కాని రెండోవైపున వారు తమ ఫ్యాక్టరీలపైన, గనులపైన,

ప్లాంటేషన్లు (తేయాకు, రబ్బరు వగైరా తోటలు) మొదలైన వాటిపైన గల యాజమాన్యాన్ని వెంటనే వదులుకోలేదు. వీటి మీద చాలకాలం పెత్తనం చెలాయించారు. వీటిమీద వచ్చిన లాభాలు విదేశీ గుత్తపెట్టుబడిదార్ల ప్రయోజనాలను కాపాడ్డానికి ఇతర దేశాలకు పంపబడుతూ వచ్చాయి; తత్ఫలితంగా పరాధీన దేశాల ప్రజలు నేడు దారిద్ర్యంలో కుములుతున్నారు.

రెండవ సమస్య, వెనుకబడియున్న తమ ఆర్థిక వ్యవస్థను అభివృద్ధి పరచుకోడానికి కావలసిన యంత్ర సామగ్రిని, సాంకేతిక సహాయాన్ని అభివృద్ధి చెందిన దేశాల నుంచి యెలా పొందాలి-అనేది.

కొత్తగా స్వాతంత్ర్యం పొందిన దేశాల్లో అధికారానికి వచ్చిన ప్రభుత్వాలను ప్రజలు మొత్తంమీద బలపరుస్తున్నారు; ఆర్థికంగా తమ దేశాలను అభివృద్ధి చేసుకోవాలని ఆ ప్రభుత్వాలు కోరుతున్నాయి. కాని వాటిలో చాల ప్రభుత్వాలు జాతీయ పెట్టుబడిదారీ వర్గంయొక్క బలమైన పలుకుబడి క్రింద ఉండడమో, ఆ వర్గం యొక్క నాయకత్వం క్రింద వుండడమో కనిపిస్తుంది. అందుచేత ఆ ప్రభుత్వాలు ఎవరి నుంచి రాజకీయ స్వాతంత్ర్యం పొందాయో ఆ సామ్రాజ్యవాదుల నుంచే ఆర్థిక సహాయం కూడా పొందవచ్చునని ఆశిస్తాయి. తమ క్రింద చాలకాలం బానిసలుగా ఉన్నవారు స్వాతంత్ర్యం సంపాదించుకున్నందు కెంతో సానుభూతి ఉన్నట్లు, సర్వవిధాల వారికి సహాయం చేసేటట్లు సామ్రాజ్యవాదులు నటిస్తారు. ఆర్భాటంతో కూడిన ప్రకటనలు అనేకం చేస్తారు. వాటిని యీ ప్రభుత్వాలు నమ్ముతాయి. అందుచేతనే ఈ ప్రభుత్వాలు తమ దేశాల్లో వున్న విదేశీ గుత్తపెట్టుబడులను జాతీపరం చేయడానికిగాని, వాటి దోపిడీని గట్టిగా అదుపులో పెట్టడానికిగాని వెంటనే చర్యలు తీసుకోవు.

ఐతే యిట్టివిధానంవల్ల ఆ దేశంయొక్క ఆర్థిక వ్యవస్థను అభివృద్ధిపరచుకోడాని కవసరమైన, విస్తృతమైన, శక్తివంతమైన

వనరులు లేకుండా పోతాయి; ఆర్థిక యిబ్బందులలో ఆ ప్రభుత్వాలు యిరుక్కోవలసి వస్తుంది; అవి రూపొందించే అభివృద్ధి ప్రణాళికలు ధ్వంసమవుతాయి. అంతేకాదు. విదేశీగుత్తాధిపతులు తమ పలుకుబడిని మరింత కోల్పోతామన్న భయంతో ఉత్పత్తిని ధ్వంస మొనర్చాలని లేదా సంపదను నాశన మొనర్చాలని చూస్తారు. ఉదాహరణకు గనులలో ఎప్పటికప్పుడు పని సక్రమంగా జరగడాని కవసరమైన సాంకేతిక యేర్పాట్లను అమలు జరపరు; ఫ్యాక్టరీలలో పాత యంత్రాల స్థానే కొత్త యంత్రాలను స్థాపించరు; తేయాకు, రబ్బరు వగైరా తోటల్లో ఎప్పటికప్పుడు క్రమబద్ధంగా నాట్లువేయరు.

ఇట్టి పరిస్థితుల్లో విదేశీ పెట్టుబడులమీద ఆ ప్రభుత్వాలు ఏవైనా నిబంధనలు విధించదలచుకుంటే, లేదా వాటిని జాతిపరం చేయదలచుకుంటే సామ్రాజ్యవాదులు సైనికబలంతో మీద పడతామని బెదిరిస్తారు. అంతవరకు వారు ప్రదర్శిస్తూ వచ్చిన "సానుభూతి" అంతర్ధానమవుతుంది; వారి సామ్రాజ్యవాద ఆత్మ అసలురంగుల్లో బయటపడుతుంది.

ఇందుకు వివరాలతో ఉదాహరణ లీయనవసరం లేదు. అవి ప్రజలందరికీ తెలుసు. ఇరాన్ ప్రభుత్వం పెట్రోలుగనులను జాతిపరం చేయడానికి సిద్ధమైనప్పుడు అమెరికా, బ్రిటన్‌లు సైనిక చర్యలు తీసుకోడానికి కుట్రలు సల్పాయి; బ్రిటన్ నూనెగనులపై తనకున్న పెత్తనంలో కొంత అమెరికాకు యివ్వవలసి వచ్చింది. కర్నల్ నాజర్ ఈజిప్టుప్రజల ఆస్తి అయిన సూయెజ్ కెనాల్ కంపెనీని జాతిపర మొనర్చినప్పుడు బ్రిటిష్, ఫ్రెంచి సేనలు ఈజిప్టు మీద దండెత్తాయి. దీన్నిబట్టి, సామ్రాజ్యవాదులు వెనుకబడిన దేశాలపట్ల చూపే సానుభూతి కపటత్వంతో కూడుకొన్నదని తెలుసుకోవచ్చు. అంతేకాదు. దృఢనిశ్చయులైన ప్రజలు, ఐక్యతతో పురోగమించే ప్రజలు ప్రపంచదేశాలలోని అభివృద్ధికరశక్తుల సహాయంతో ఏవిధంగా తమ దేశాన్ని రక్షించు

కోగలరో నిరూపింపబడింది. లాటిన్ అమెరికాలో పెట్రోలుగను లను, తదితర గనులను ఆ యా ప్రభుత్వాలు జాతిపరమొనర్చ డానికి సిద్ధపడినప్పుడు అమెరికన్ సామ్రాజ్యవాదులు ప్రతిఘటిం చారు; అరబ్బుదేశాలు తమ సొంత ఆస్తి ఐన పెట్రోలుగనుల మీద వచ్చే లాభాలన్నిటినీ అనుభవించడానికి చర్యలు తీసుకొం టున్న సమయంలో "ఐసెన్‌హోవర్ సిద్ధాంత"మనే దురాక్రమణ పూరిత పథకంతో ముందుకొచ్చి, తమ ఆగ్రహావేశాలను ప్రదర్శించారు. భారతప్రభుత్వం గనులను, ప్లాంటేషన్లను, పెట్రోలు వనరులను, బ్యాంకు పెట్టుబడులను, ఇన్సూరెన్స్ పెట్టుబడులను జాతిపరం చేయదలచుకున్నప్పుడు బ్రిటిష్‌సామ్రాజ్య వాదులు తీవ్రంగా వ్యతిరేకించారు. వాటిలో బ్రిటిష్ పెట్టుబడి అనేక కోట్లపౌనుల విలువగలది ఉంది. సామ్రాజ్యవాదుల ప్రతిఘటనవల్ల భారతప్రభుత్వం జీవితభీమాను, ఇంపీరియల్ బ్యాంకును మాత్రమే జాతిపరంచేసి ఊరుకోవలసి వచ్చింది. ఒకవైపు ప్రజలు గనుల్నీ ప్లాంటేషన్లనూ జాతిపరం చేయాలని డిమాండుచేస్తుంటే, మరోవైపు ప్రభుత్వం ఆ స్కీముకు పరిమితు లను విధించింది. అలాచేస్తే సామ్రాజ్యవాదులు పంచవర్ష ప్రణా ళికకు సహాయంచేస్తారనీ, తద్వారా ఆ దేశంయొక్క ఆర్థికాభి వృద్ధికి తోడ్పడతారనీ వారు ఆశించారు.

తమ్ము ఆర్థికంగా పరాధీనతలో ఉంచేందుకు ఉద్దేశింపబడ్డ యీ సామ్రాజ్యవాద కుట్రలను కొత్తగా స్వాతంత్ర్యం పొందిన దేశాల ప్రజలు శక్తివంతంగా ఎదుర్కొంటున్నారు. అందుచేత వారు విదేశీ పెట్టుబడుల పెత్తనంక్రింద ఉన్న సంస్థలన్నిటినీ జాతి పరం చేయాలనీ, ఆర్థికంగా తాము అభివృద్ధి చెందడానికిది అవసర మనీ డిమాండు చేస్తున్నారు. జాతీయాభివృద్ధికి ముప్పు తెచ్చే విధంగా విదేశీ పెట్టుబడిదారులు సాగించే వర్తక వ్యాపారాన్నీ తదితర కార్యకలాపాలనూ అదుపులో పెట్టాలని కోరుతున్నారు. ఈ విధంగా అనేక దేశాల్లో వలస విముక్తిని సాధించుకొనేందుకు

జాతీయ స్వాతంత్ర్యాన్ని పటిష్ఠ మొనర్చుకొనేందుకు జరిగే పోరాటం విదేశీ పెట్టుబడులను జాతీయ మొనర్చాలనే కోర్కెలో, విదేశీ గుత్త పెట్టుబడుల యినుప పిడికిలినుంచి సహజ సంపదను విముక్తి చేయాలనే డిమాండులో వ్యక్తమవుతోంది.

వెనుకబడిన దేశాలకు యంత్రసామగ్రి, సాంకేతికసహాయం ఎంతో అవసరమని గుర్తెరిగిన సామ్రాజ్యవాదులు యీ దేశాల స్వాతంత్ర్యాన్ని బలహీన మొనర్చడానికి సర్వవిధాల ప్రయత్నిస్తున్నారు; అట్టి సహాయానికి చాల కఠినమైన షరతులు విధిస్తున్నారు.

వలసరాజ్యాధిపతులు తమ దోపిడీవిధానాన్ని కొనసాగించేందుకు కొత్తబుర ఖాలు ధరిస్తున్నారు. ఆర్థికసహాయం పేరుతో ఆయా దేశాలమీద పెత్తనం చేయడానికి ప్రయత్నిస్తున్నారు. ఉదాహరణకు ఆగ్నేయాసియాదేశాలకు కొలంబో ప్రణాళిక; అర్జంటైనాకు ప్రెబిష్‌ప్లాను; వార్రెస్‌ప్లాను; చిలీకి క్లీన్‌సాక్స్‌ప్లాను; క్యూబాకు ట్రూలోప్లాను; అంతర్జాతీయ ఫైనాన్స్ కార్పొరేషన్, ప్రపంచబ్యాంకు తయారుచేసిన వివిధ ప్రణాళికలు. బ్రిటిష్, ఫ్రెంచి పాలకవర్గాలు ప్రత్యక్షమైన రాజకీయ పెత్తనంద్వారా కొనసాగించిన పాతకాలపు వలసవిధానానికి బదులు అమెరికన్ వలసరాజ్యాధిపతులు ఆర్థిక సహాయం ద్వారా, కమ్యూనిస్టు ప్రమాదాన్నెదుర్కొనే పేరుతో కుదుర్చుకొంటున్న సైనిక ఒడంబడికలద్వారా, సాంకేతిక బృందాలద్వారా, యింకా అనేక పద్ధతులలో వలసదోపిడీని కొనసాగించేందుకు ముందుకు వస్తున్నారు. వారు చేయదలచుకున్న సహాయం కొత్తగా స్వాతంత్ర్యం సంపాదించుకున్న దేశాలను ఆర్థికంగా అభివృద్ధిచేయదు సరికదా, అలా "సహాయంచేసే" సామ్రాజ్యవాదుల పెత్తనాన్ని లేదా కంట్రోలును విధిలేక అంగీకరించవలసిన స్థితి ఆ దేశాలకు ఏర్పడుతుంది; అవి స్వతంత్రమార్గంలో అభివృద్ధిచెందడానికి వీలులేకుండా పోతుంది.

అనేక దేశాల్లో జాతీయ పెట్టుబడిదారీవర్గం, ప్రజలు తమ దేశాలను ఆర్థికంగా అభివృద్ధిచేసుకోవాలంటే వివిధ స్థాయిలలో, విభిన్న రూపాలలో పెట్టుబడులపై ప్రభుత్వ యాజమాన్యం అవసరమని తెలుసుకుంటున్నారు. అట్టి యాజమాన్యంవల్ల ప్రజలు పెట్టుబడిదార్ల కార్యకలాపాలను ప్రజాస్వామ్యయుతమైన కంట్రోలులలో ఉంచగల్గుతారు; రెండో వైపున కార్మికులు, కార్మిక సంఘాలు ఆర్థిక వ్యవస్థకు, ప్రజాజీవితానికి సంబంధించిన ప్రభుత్వ కార్యకలాపాలతో ప్రత్యక్ష సంబంధ మేర్పరచుకోగల్గుతారు.

కాని కొత్తగా స్వాతంత్ర్యం పొందిన ఈ దేశాల్లో జాతీయ ఆర్థిక వ్యవస్థ ఈ విధంగా విస్తరించడమంటేగాని అభివృద్ధి చెందడమంటేగాని సామ్రాజ్యవాదులకు యిష్టంలేదు. ఈ దేశాల్లో విదేశీపెట్టుబడుల కార్యకలాపాలమీద విధింపబడే కంట్రోళ్లను లేదా పరిమితులను వారు ఏవగించుకొంటున్నారు.

అందుచేత యీ దేశాలు ఆర్థికసహాయ మడిగినప్పుడల్లా తమ పెట్టుబడులు తమ యాజమాన్యం క్రిందనే ఉండేటట్లు యిప్పుడుగాని యికముందుగాని వాటిని జాతిపరం చేయకుండేటట్లు హామీ యివ్వమని డిమాండు చేస్తున్నారు. తాము సంపాదించే లాభాలను విదేశాలకు పంపించుకొనేందుకు స్వేచ్ఛ, తమనిపుణులు ప్రత్యేకాధికారాలను అనుభవించేందుకు స్వేచ్ఛ అవసరమంటున్నారు. వీటికి అంగీకరించడమంటే దేశీయ పెట్టుబడులకు, దేశీయ నిపుణులకు, దేశీయ కార్మికులకు నష్టం వాటిల్లజేయడం తప్ప మరొకటికాదు. అందుచేత, కొత్తగా స్వాతంత్ర్యం పొందిన దేశాలు ఆర్థికంగా అభివృద్ధి చెందడాని కవసరమయిన చర్యలు సమగ్రంగా, ప్రజాస్వామ్య పద్ధతుల్లో దేశానికీ, ప్రజలకూ ఉపయోగపడేవిధంగా తీసుకోదలిస్తే—వలస విధానానికి వ్యతిరేకంగా యికముందుకూడ పోరాటం కొనసాగించవలసి యుంటుంది.

అంటే, సామ్రాజ్యవాదం నుంచి రాజకీయంగా విముక్తి చెందినంత మాత్రాన వలసవిధానానికి వ్యతిరేకంగా సాగించవల

సిన పోరాటం సమాప్తమవదన్నమాట; పోరాటరూపం, పోరాట పరిధి మాత్రమే మారుతుంది.

అందుచేత, యీ దేశాలు తమ స్వాతంత్ర్యాన్ని పటిష్ఠ మొనర్చుకోడానికి ఏవిధంగా ఆర్థికరంగంలో అభివృద్ధి చెందవచ్చు? ఈ పరివర్తనకు కార్మికవర్గ మేవిధంగా తోడ్పడగల్గుతుంది? కొత్తగా స్వాతంత్ర్యం పొందిన దేశాలూ అంతకుముందే స్వాతంత్ర్యం పొందిన దేశాలూ ఆర్థికంగా అభివృద్ధి చెందడానికి ట్రేడ్ యూనియన్ ఉద్యమం ఏవిధంగా దోహదం చేయగల్గుతుంది? కార్మికవర్గం తన హక్కులకోసం తాను పోరాడుతూనే, సామ్రాజ్య వాదానికి వ్యతిరేకంగా కొత్తరూపంలో జరిగే యీ పోరాటంలో నిర్వహించవలసినపాత్ర ఏదైనాఉందా? ఇండియా, ఇండోనేషియా, బర్మా, సింహళం, ఈజిప్ట్. తదితర అరబ్బుదేశాల్లోగాని, బ్రెజిల్ మెక్సికో మొదలైన లాటిన్ అమెరికా దేశాల్లోగాని, కొత్తగా స్వాతంత్ర్యం పొందిన ఆఫ్రికా దేశాల్లోగాని కార్మికవర్గం ముందడుగు వేయడానికి, దేశం అభివృద్ధి చెందడానికి మార్గమేమిటి?

కొత్తగా స్వాతంత్ర్యం పొందిన దేశాలు (స్వాతంత్ర్యం కొరకు పోరాడుతూన్న దేశాలుకూడ) ఆర్థికాభివృద్ధికి సంబంధించినంతవరకు వేర్వేరు దశల్లో ఉన్నాయి. ఇది సహజమే. పూర్వం అవి సామ్రాజ్యవాదదేశాల పెత్తనంక్రింద అనుబంధ ప్రాంతాలుగా ఉంటూ వచ్చాయి; వాటికి చౌకగా ముడిపదార్థాలను కార్మికుల శ్రమశక్తిని సప్లయిచేస్తూ ఉండాలి; అందుచేత వాటి ఆర్థికాభివృద్ధి ప్రధానంగా సామ్రాజ్యవాద దేశాల అవసరాలకు లోబడి ఉండేది. కాబట్టి ఆ దేశాలు గణనీయంగా భారీపరిశ్రమలను అభివృద్ధిచేసుకోలేక పోయాయి. అస్తవ్యస్తంగాను, అసమగ్రంగాను మాత్రమే అవి అభివృద్ధి చెందాయి. కార్మిక వర్గంయొక్క సంఖ్య, కాలం (Age), పరిశ్రమల రకాలు ఒక్కొక్క దేశంలో ఒక్కొక్క విధంగా ఉన్నాయి.

ఉదాహరణకు 36 కోట్ల జనాభాగలిగిన భారతదేశానికి 1957 లో ఏటా 10 లక్షల టన్నులకంటె ఎక్కువ ఉత్పత్తి చేయ జాలని ఉక్కుపరిశ్రమఉంది కాని 1 కోటి 20 లక్షల జనాభాగలిగిన జెకొస్లోవేకియా ఏటా 40 లక్షల టన్నుల ఉక్కును ఉత్పత్తి చేసుకో గల్గుతోంది. భారత దేశంలో తేయాకు తోటలు, జూట్ పరి శ్రమ, బట్టల పరిశ్రమ ఎక్కువగా అభివృద్ధి చెందితే, ఈజిప్టు సుడాన్‌లలో మేలురకం పత్తి విస్తారంగా పండుతున్నప్పటికీ సొంత బట్టల మిల్లులంటూ లేవు. సూయజ్ కాలువ, రేవు పట్ట ణాలు మాత్రమే ఈజిప్టుకున్న ప్రధాన పెట్టుబడులు. అరబ్బు ప్రజలు నివసించే మధ్యప్రాచ్యంలో కార్మికవర్గం కొద్దిగా యీ మధ్యనే ఉద్భవించింది. అక్కడ వలస రాజ్యాధిపతులు నూనె గనులను త్రవ్వడం ప్రారంభించడంవల్ల యీ పరిణామం సంభవమైంది. లాటిన్ అమెరికాలోను, ఆఫ్రికాలోను అంతర్జా తీయ గుత్తపెట్టుబడిదారీ సంస్థలు గనుల త్రవ్వకంమీద, ప్లాంటే షన్లమీద విస్తారమైన పెట్టుబడులు పెట్టడంవల్ల వాటి సమీపంలో కొన్ని రైల్వేలు, రేవుస్థలాలు, కొద్దిగా పట్టణాలు వెలిశాయి. అవి మినహాయిస్తే, అతి విస్తృతమైన ఈ దేశాల్లో నివసించే లక్ష లాది ప్రజలు యిప్పటికీ వ్యవసాయానికే కట్టుబడి యున్నారు.

విదేశీ గుత్తపెట్టుబడిదారుల పెత్తనంక్రింద నలిగిపోతున్న వీరు తమదేశాల స్వాతంత్ర్యంకొరకు చాలా పోరాటాలు జరిపారు. కార్మికవర్గం—అది ఎంత చిన్నదైనప్పటికీ, ఎంత తక్కువసంఖ్యలో ఉన్నప్పటికి—యితర వర్గాలతో కలిసి సమ్మెపోరాటాలు జరపడం ద్వారా స్వాతంత్ర్యోద్యమానికి చేయూతనిచ్చింది.

ఈ దేశాలన్నీ విదేశీ సామ్రాజ్య వాదుల పెత్తనంక్రింద ఉండడంవల్ల వాటి ఆర్థిక వ్యవస్థ అధ్వాన్నంగా తయారైంది. అందువేత కార్మికవర్గంకూడా దారిద్ర్యంవల్లను, కడు హీనమైన పని పరిస్థితులు జీవితపరిస్థితులవల్లను ఎన్నో బాధలు అనుభవించవలసి వచ్చింది. ప్రజాస్వామ్య హక్కులుగాని, ట్రేడ్ యూనియన్

హక్కులుగాని వారికి పూజ్యం. కార్మికులు విదేశీ పీడకులకు వ్యతిరేకంగా తమ దేశంకొరకు, హక్కులకొరకు కూడా పోరాటం జరిపారు. ఒక్కొక్కప్పుడు జాతీయ పెట్టుబడిదారీవర్గంలో కొందరు కార్మికుల కోర్కెలను నిరాకరించేందుకు వలస రాజ్యాధిపతులతో చేతులుకలిపేవారు. అలాంటి సందర్భాలలో ట్రేడ్ యూనియన్లు జాతీయ పెట్టుబడిదారీ వర్గానికి వ్యతిరేకంగా పోరాడవలసివచ్చేది. ఐతే వలసవిధానానికి వ్యతిరేకంగా జాతీయ స్వాతంత్ర్యంకొరకు జరిగే ఉమ్మడి పోరాటంలోమాత్రం కార్మికులు ఆ వర్గాన్ని బలపరచడం మానలేదు.

మొన్నటివరకు వలసదేశాలుగా ఉంటూ యీమధ్యనే స్వాతంత్ర్యంపొందిన దేశాల్లో కార్మికవర్గం ఆర్థికాభివృద్ధి విషయంలోను, తన పరిస్థితుల్ని బాగుపరచుకొనే విషయంలోను కొత్త సమస్యల నెదుర్కోవలసి వచ్చింది.

కొత్తగా స్వాతంత్ర్యం పొందిన దేశాల ప్రభుత్వాలు ఉత్పత్తిని అధికంచేయడానికి, జాతీయాదాయాన్ని పెంచడానికి, ఉద్యోగావకాశాలను హెచ్చించడానికి, వేతనాలను అధికంచేయడానికి కావలసిన అభివృద్ధిప్రణాళికలను తయారుచేస్తే, కార్మికవర్గం వాటిని బలపరచి తీరుతుంది; దేశాన్ని అభివృద్ధిచేసే విషయంలో తన విధుల్ని తాను నిర్వర్తించడానికి సంసిద్ధత ప్రకటిస్తుంది. ఈ దేశాలు ఆర్థికంగా అభివృద్ధి చెందితేనే జాతీయ సంపద వృద్ధి చెందుతుందనీ, తాముకూడా అభివృద్ధిచెంది విముక్తిని సాధించడం సాధ్యపడుతుందనీ ట్రేడ్ యూనియన్లకు తెలుసు. కనుకనే అవి జాతీయార్థికాభివృద్ధికి అవసరమయే ప్రణాళికలను ఉత్సాహంగా బలపరుస్తాయి. ఒకానొకదశలో అట్టి అభివృద్ధి పెట్టుబడిదారీవర్గం యొక్క దోపిడీమీద ఆధారపడి యుండవచ్చు. అయినప్పటికీ, అలాంటి పరిస్థితుల్లో కూడా పారిశ్రామికాభివృద్ధి దేశాన్ని ముందుకు తీసుకుపోడానికే ఉపయోగపడుతుంది; వలసవిధానానికి వ్యతిరేకంగా పోరాట్టంలో కార్మికులకు బలం చేకూర్చుతుంది;

కార్మికవర్గం ఇంకా యెక్కువ పోరాటాలు జరపడానికవసరమైన పరిస్థితులను కల్పిస్తుంది.

కనుకనే ఇండియా, ఇండోనేషియా, ఈజిప్ట్, సిరియా, ఇరాన్, లాటిన్, అమెరికా మొదలైన దేశాల ప్రభుత్వాలు విదేశీ గుత్తపెట్టుబడిదార్లకు వ్యతిరేకంగా సాగిస్తూ వచ్చిన పోరాటాలను ట్రేడ్‌యూనియన్ ఉద్యమం, కష్టజీవులైన ప్రజా సామాన్యం బలపరిచారు; ఆర్థికంగా అభివృద్ధి చెందడానికి ఆ ప్రభుత్వాలు తయారు చేసిన ప్రణాళికలను హృదయ పూర్వకంగా బలపరిచారు.

ఈ దేశాలు వలసవిధానానికి వ్యతిరేకంగా ఆర్థికాభివృద్ధి కొరకు సాగించే పోరాటంలో ట్రేడ్‌యూనియన్లు విదేశీ గుత్తపెట్టుబడిదారీ సంస్థలను జాతీయం చేయాలని, లేదా కనీసం వాటి ప్రాబల్యాన్ని తగ్గించడంద్వారా అందుకవసరమైన తొలిచర్యలు తీసుకోవాలని డిమాండు చేయడం సహజం; యిది వాటి ప్రధాన నినాదాల్లో ఒకటిగా ఉండడంకూడా సహజమే.

అంతేకాదు; జాతీయం చేయబడిన ఉత్పత్తి రంగాలను ఆధారంగా చేసుకొని ఆయా దేశాల ఆర్థిక వ్యవస్థను క్రమపద్ధతిలో మరింత అభివృద్ధి చేయాలని ట్రేడ్‌యూనియన్లు కోరడం ఎంతో అవసరం, సహజం.

అలాంటి చర్యలను విదేశీ గుత్త పెట్టుబడిదారీ సంస్థలు అతి తీవ్రంగా ప్రతిఘటిస్తాయనడంలో సందేహం లేదు. అయితే, జాతీయ పెట్టుబడిదారీవర్గం గట్టిగా నిలబడి ప్రజలందరి సహకారం తీసుకున్నట్లయితే—అలా తీసుకోడం తప్పనిసరి అవుతుంది— వీలైన చోట్ల సోషలిస్టు దేశాల సహాయం తీసుకోడానికికూడా సంకోచించకుండా ఉన్నట్లయితే, వలస రాజ్యాధిపతుల్ని వెనక్కు తగ్గేటట్లు చేయవచ్చు.

విదేశీ గుత్తపెట్టుబడిదార్ల సంస్థలను జాతీయంచేసి, లేదా వాటి ప్రాబల్యాన్ని తగ్గించి, ప్రభుత్వరంగం ఆధారంమీద

దేశాన్ని అభివృద్ధిచేస్తే— ఆర్థికంగా అభివృద్ధి చెందడానికి ముందడుగు వేయగల శక్తిని యీ దేశాలు సంపాదిస్తాయి.

ఐతే దీనిఅర్థం అభివృద్ధిచెందిన దేశాలనుంచి యంత్రసామగ్రి, సాంకేతిక పరిజ్ఞానం మొదలైన రూపాల్లో యీ దేశాలకు ఎట్టి సహాయం అవసరం ఉండదని కాదు. తప్పకుండా అట్టిసహాయం వాటికి అవసరమే. ఐతే అందుకు వెనుకబడిన దేశాలు తమ స్వాతంత్ర్యాన్ని, భవిష్యత్తును తాకట్టు పెట్టడానికి మాత్రము అంగీకరించకూడదు. విదేశాలనుంచి అసలు సహాయమే తీసుకోరాదని కార్మిక వర్గం చెప్పదు. అయితే అట్టి సహాయం ఏవిధమైన షరతులకూ లోబడి ఉండకూడదని, సహాయం తీసుకునే దేశంయొక్క స్వాతంత్ర్యానికి హానికలుగ కూడదని, అట్టి సహాయం ఆ దేశానికి, దేశప్రజలకు మేలుకలిగించే విధంగా నిజమైన ఆర్థికాభివృద్ధికి తోడ్పడే టట్లుండాలని కార్మికవర్గం పట్టుపట్టాలి.

విదేశీ గుత్తపెట్టుబడిదార్ల బ్యాంకులు తమకు సహాయం చేస్తాయని అనేక దేశాలు గంపెడాశతో ఎదురుచూడ్డం, ఆ సహాయం పరిశ్రమల అభివృద్ధికి నిజంగా వినియోగింపబడుతుందని తెలుసుకోగానే బ్యాంకులు నిరాకరించడం ఎన్నోసార్లు జరిగింది. ఒకవేళ నిరాకరించకుండా ఉన్నప్పటికీ, సరకుల ఖరీదును విపరీతంగా పెంచివేయడంవల్ల ఆదేశాలూ వాటి వనరులూ అప్పులలో కూరుకుపోవడమో, అభివృద్ధి ప్రణాళికలు ఆలస్యంగా అమలుజరగడమో, అనుకున్న వ్యవధిలో అవి పూర్తికాకపోవడమో, లేదా అవి వక్ర రూపంలో తయారవడమో జరుగుతోంది. ఫలితమేమంటే, ఆ దేశాల ఆర్థికాభివృద్ధి కుంటుపడుతోంది; వెనుకబడిన దేశాలలో కొందరు గుత్తపెట్టుబడిదార్లు మాత్రమే కొద్దిపాటి లాభాలు సంపాదించుకో గల్గుతున్నారు.

ఇట్టి ప్రతిష్టంభననుంచి బయటపడే మార్గంలేదా ?

ఉంది. సోషలిస్టు శిబిరానికి చెందిన దేశాలు బడుగుదేశాలకు సహాయం చేయడానికి సిద్ధంగా ఉన్నాయి; బడుగుదేశాల కృషికి తోడ్పడగల కొత్త స్నేహితులు యీ దేశాలు.

వివిధ దేశాల జాతీయ పెట్టుబడిదారీ ప్రభుత్వాలుసైతం యీ యోజున ఒక చారిత్రక సత్యాన్ని గుర్తిస్తున్నాయి. అదిఏమంటే ఆర్థికాభివృద్ధికై జరిగే కృషిలోను, వలస విముక్తి పోరాటాల్లోను సహాయం పొందగోరే దేశాలు యికపై సామ్రాజ్యవాద దేశాల మీద, అవి యిచ్చే సాంకేతిక సహాయంమీద ఆశలు పెట్టుకోరాదు.

భారతదేశంలో ఉక్కు కర్మాగారాల, ఇంజనీరింగ్ కర్మాగారాల నిర్మాణంలోను, నూనెగనుల పరిశోధనలోను, సాంకేతిక నిపుణుల తరిఫీదులోను సోవియట్ పరిశ్రమలుచేసే సహాయాన్ని పెట్టుబడిదార్లు కోసహాయావన్నంది ప్రజలు గుర్తిస్తున్నారు. బ్రిటిష్, జర్మన్, అమెరికన్ బ్యాంకర్లు భారతదేశానికిచ్చే ఋణం మీద 100 కి 4 లేక 5 వరకు వడ్డీ డిమాండుచేస్తూంటే, సోవియట్ యూనియన్ 100 కి 2 1/4 రేటు మాత్రమే అడిగిందని తెలుసుకున్నప్పుడు భారతప్రజలు సంతోషపడ్డారు. ఇండియాలో నూనెగనుల పరిశోధనకు సోవియట్ యూనియన్, రుమేనియా దేశాలు సహాయం చేయడాని కంగీకరించాయి. బ్రిటన్, అమెరికాల గుత్తాధిపత్యాన్ని పడగొట్టడానికి భారతప్రభుత్వం. ప్రజలు చేసే కృషికి యీ సహాయం దోహదమీయగలదని చెప్పవచ్చు.

బ్రిటిష్‌వారు సింహళదేశపు రబ్బరును కొనడం మానివేసి, తద్వారా తమ ధరలను సింహళంమీద బలవంతంగా రుద్దదలచుకున్నప్పుడు చైనా సింహళదేశపు రబ్బరును కొని తన బియ్యాన్ని చౌకగా పంపింది. ఈ వార్త సింహళప్రజల్ని ఎంతో ఉత్సాహపరచింది. బర్మా విషయంలోకూడా యిలానే జరిగింది.

ఈజిప్టు, సిరియా మొదలైన మధ్యప్రాచ్య దేశాలు స్వాతంత్ర్యంకోసం పోరాడుతున్న సమయంలో సోషలిస్టు శిబిరానికిచెందిన జెకోస్లొవేకియా, సోవియట్ యూనియన్ మొదలైన దేశాలు

వాటికి సహాయం చేశాయి. సోవియట్ నిపుణులు సూయెజ్ కాలువను కాపాడ్డానికి వెళ్ళామని పేర్కొ యిచ్చినప్పుడు సామ్రాజ్య వాదులు ఎంత గగ్గోలు చేశారు! అలాగే, సోవియట్ వాణిజ్య బృందాలు కొన్ని లాటిన్, అమెరికా రిపబ్లిక్కులకు వెళ్ళినప్పుడు అమెరికన్ గుత్తవ్యాపారస్తు లెంత హడలెత్తిపోయారు!

సోషలిస్టు దేశాలు చేస్తున్న సహాయం ఈరోజున అధికంగా లేకపోవచ్చు. కేవలం సుహృద్భావ సూచకంగా చేసే సహాయం కూడా గుత్తపెట్టుబడిదార్ల ఆగ్రహావేశాలకు కారణమవుతోంది. కొన్ని వెనుకబడిన దేశాల్లో ప్రభుత్వాలు జాతీయ పెట్టుబడిదారీవర్గం యొక్క పెత్తనంక్రింద ఉన్నాయి. అవి సాధారణంగా సోషలిస్టు దేశాలసహాయాన్ని కోరవు. ఎందుచేతంటే, యితర పెట్టుబడిదారీ దేశాలతో వాటికిగల సంబంధాలు చెడిపోవచ్చునని భయపడ తాయి. అలాంటి ప్రభుత్వాలుకూడా యీ సహాయానికి కృతజ్ఞత తెలియజేస్తున్నాయి. కారణ మేమంటే, గుత్తపెట్టుబడిదార్లనుంచి అనుకూలమైన షరతులపై సహాయం పొందేటందుకు సైతం యీ సహాయం తోడ్పడుతుంది. సోషలిస్టు దేశాలను అడుగు తాముసుమా అని బెదిరించడానికైనా యిది వాటి కవసరం. అంతేకాదు. ఈ ప్రభుత్వాలు గత అనుభవంనుంచి నేర్చుకున్న విషయ మేమంటే సామ్రాజ్యవాద గుత్తాధిపతులతో చేసే వ్యాపారంవల్ల చాల నష్టం కలుగుతుంది. ద్రవ్యం హరించుకు పోతుంది. సోషలిస్టు దేశాలతో వ్యాపారం అలాకాక సమాన హోదాపైన నిజాయితీతో జరుగుతుంది.

అందుచేత సోషలిస్టుదేశాలుచేసే సహాయానికి కార్మికవర్గం స్వాగతమివ్వాలి. ఆ యా దేశాలు తమ స్వాతంత్ర్యాన్ని రక్షించు కొనే విషయంలో యిట్టి సహాయం ఎంత రాజకీయ ప్రాముఖ్యాన్ని కలిగియుందో కార్మికవర్గం జనసామాన్యానికి వివరించి చెప్పాలి.

అంతేకాదు. సోషలిస్టుదేశాలకు చెందిన సాంకేతిక నిపుణులు బడుగుదేశాల కార్మికులయెడ ఎలా ప్రవర్తిస్తారో కార్మికవర్గం

ప్రత్యక్షంగా చూస్తూనే ఉంది; ఇతరులకు ఆ విషయం తెలియ జెప్పవచ్చు. వారి వైఖరికీ, పెట్టుబడిదారీదేశాలనుండి వచ్చే నిపుణుల వైఖరికి ఎంత వ్యత్యాసముందో వారు స్పష్టంగా చూడవచ్చు.

సహాయం రూపంలో మనకు లభించేది సోషలిస్టు ద్రవ్య మొక్కటే కాదు; సోషలిస్టు సాంకేతికపద్ధతు లొక్కటే కాదు. శ్రామికవర్గ అంతర్జాతీయత అనే మహోన్నత భావంతో ఉత్తేజితు లయిన సాంకేతిక నిపుణుల సహాయం మనకు లభిస్తోంది. వారిలో పాలకజాతుల అహంభావంగాని మనస్తత్వంగాని ఉండదు. పై వారి నుంచి పని తీసుకొనేటప్పుడు, క్రిందివారికి పనియిచ్చేటప్పుడు కూడా వారు సహాయంచేసే వ్యక్తులుగా, కార్మికులుగా వ్యవహ రిస్తారు. పెట్టుబడిదారీదేశాల నిపుణులంటారా? వారు "నాటు" కార్మికులయెడ సామ్రాజ్యవాద వైఖరితో మెలగుతారు.

ఆర్థికంగా వెనుకబడియుండే ఒకదేశం—చైనా రిపబ్లిక్— సహాయంకోసం సామ్రాజ్యవాదుల్ని దేవురించకుండా, లంచగొండి తనాన్ని నిర్మూలిస్తూ, ఉత్పత్తిని అధికంచేస్తూ, కష్టజీవుల జీవన ప్రమాణాన్ని పెంచుతూ, స్వయంకృషిద్వారాను సోవియట్ యూనియన్ మొదలైన సోషలిస్టు దేశాల సహాయంతోను పరిశ్రమ లనే కాకుండా వ్యవసాయాన్నికూడా అభివృద్ధిచేసుకొంటూ, పెద్ద పెద్ద అడుగులు వేసుకుంటూ ముందుకు నడుస్తోంది. అట్టి దేశానికి ఐక్యరాజ్యసమితిలో సామ్రాజ్యవాదులు స్థాన మివ్వ డానికి నిరాకరిస్తున్నారంటే ఆశ్చర్యపడవలసిన అవసరంలేదు. కాని, వారు చైనా పురోగమనా న్నెంతోకాలం ఆటంకపరచలేరు.

పై విధాలైన సహాయంతోబాటు బడుగు దేశాల్లో విస్తారంగా లభించే మనుష్యబలాన్నీ ఆర్థిక వనరులనూకూడ సమీకరించ డానికి మార్గాలేవో కార్మికవర్గం, ప్రజలు జాతీయ పెట్టుబడిదారీ వర్గంతో కలసిగాని, ఇతరవర్గాలతో కలిసిగాని తెలియజేస్తూ ఉండవచ్చు. తద్వారా ఆర్థికాభివృద్ధికి దోహదం చేయవచ్చు.

ఈవిధంగా, వెనుకబడిన దేశాలు విదేశీ గుత్తపెట్టుబడిదార్ల వనరులను వినియోగించుకోడంద్వారాను, షరతులను విధించకుండా వారు చేసే సహాయాన్ని స్వీకరించడంద్వారాను, సోషలిస్టుదేశాలిచ్చే సహాయంతోను, తమదేశాల్లో లభించే వనరులతోను ఆర్థికంగా అభివృద్ధి చెందవచ్చు; తమ స్వాతంత్ర్యాన్ని పటిష్ఠమొనర్చుకోవచ్చు.

ఈ విధానాన్ని బాండుంగ్ మహాసభలో పాల్గొన్న రాజ్యాలలో కొన్ని యీనాడు అమలుజరుపుతున్నాయి. ఆ దేశాల్లో కార్మికవర్గం, ట్రేడ్‌యూనియన్లు యీ విధానాన్ని బలపరుస్తున్నాయి.

ఐతే, కొత్తగా స్వాతంత్ర్యం పొందిన కొన్ని దేశాలు దురదృష్టవశాత్తు విదేశీ గుత్తపెట్టుబడిదార్ల వలలో చిక్కుకునే మార్గ మవలంబిస్తున్నాయి. యుద్ధకూటములలో అవి చేరుతున్నాయి; సామ్రాజ్యవాదు లిచ్చే సైనికసహాయాన్ని స్వీకరిస్తున్నాయి. ఈవిధంగా అవి తమ ఆర్థికాభివృద్ధికి ముప్పుతెచ్చుకోడమేకాకుండా, తమ స్వాతంత్ర్యానికి ప్రమాదంకూడా తెచ్చుకొంటున్నాయి. ఆగ్నేయాసియా సైనికకూటమి, బాగ్దాద్ ఒడంబడికవంటి వాటిలో పాల్గొంటున్న దేశాలస్థితి సరిగ్గా యిదే.

ఇట్టి విధానాన్ని కార్మికవర్గం దృఢనిశ్చయంతో వ్యతిరేకించవలసి యుంటుంది. కారణ మేమంటే, యిది ఒక కొత్తరకపు వలసవిధానానికి, అమెరికన్ గుత్తాధిపతుల వలసవిధానానికి మార్గం సుగమంచేస్తూంది. కార్మికవర్గం ఆయా దేశాల్లోని సామ్రాజ్యవ్యతిరేకశక్తులతో కలిసి తమదేశాన్ని సైనికకూటములనుంచి విముక్తి చేసేందుకు ప్రయత్నించాలి; సేనలను విపరీతంగా అభివృద్ధి చేసేందుకు తీసుకొనే చర్యలను ప్రతిఘటించాలి; ఎందుచేతనంటే అవి యీ దేశాలను మళ్ళీ వలసదేశాలుగా — కొత్తరకపు వలసదేశాలుగా — మారుస్తాయి. ఈ కొత్తరకపు వలసవిధానం పైకి వలసదోపిడీని వ్యతిరేకిస్తున్నట్లు కనిపిస్తున్నది; కాని నిజానికి మరింత

దురాశాపూరితమైన వలసదోపిడీని సాగించేందుకు పథకాలు తయారు చేస్తుంది.

మధ్యప్రాచ్య దేశాల్లో యీ వలసవిధానం 'ఐసెన్‌హోవర్ సిద్ధాంతం' అని పిలువబడుతోంది. దాని పద్ధతులు ఒకవైపు బలప్రయోగం చేస్తామని బెదరించడం, మరోవైపు ఆర్థికసహాయం చేస్తామంటూ ఊరించడం. నిర్దిష్టంగా చెప్పాలంటే, విచ్ఛిన్న చర్యలు జరిపించడం, జోర్డాన్‌లో మాదిరిగా సైనిక తిరుగుబాట్లను ప్రోత్సహించడం, సిరియాలో మాదిరిగా జాతీయ స్వాతంత్ర్యాన్ని అపహరించేందుకు కుట్రలు పన్నడం, అరబ్బుదేశాలమధ్య ఐక్యతను చెడగొట్టడం, మధ్యప్రాచ్యంలో ఉద్రిక్త వాతావరణాన్ని సృష్టించడం—యివీ దాని పద్ధతులు. అరబ్బుదేశాల జాతీయోద్యమాన్ని అణచివేసి మధ్యప్రాచ్యంలో పెత్తనం చెలాయించడం దాని ఆశయం.

ఇట్టి పరిస్థితుల్లో సహజంగా కార్మికవర్గంయొక్క కర్తవ్యం, వలసవిధానాన్ని రద్దుచేసేందుకు అరబ్బుదేశాల ఐక్యతను కోరుతూ జాతీయ ప్రతిఘటనోద్యమంలో పాల్గొనడం.

ఇక భారతదేశం విషయమేమంటే, సైనికకూటములలో తలదూర్చడానికి ఆ దేశం నిరాకరించడంవల్ల, ప్రపంచశాంతిని కోరుతూండడంవల్ల, సోషలిస్టుదేశాల సహాయం పొందడానికి ఎట్టి సంకోచం ప్రదర్శించనందున అమెరికన్ సామ్రాజ్యవాదులు బాగ్దాద్ ఒడంబడికను ఉపయోగించుకొని భారతదేశానికి పొరుగున ఉన్న పాకిస్తాన్‌కి ఆయుధాలు సప్లై చేస్తున్నారు; భారతదేశ సరిహద్దుమీద కాశ్మీర్‌లో కవ్వింపుచర్యలను ప్రోత్సహిస్తున్నారు. తత్ఫలితంగా యిటు పాకిస్తాన్‌ప్రజలు అమెరికన్ గుత్తాధిపతుల వలసదోపిడీకి గురిఅవుతున్నారు; అటు భారతదేశం తన ఆర్థిక వనరులలో కొంతభాగాన్ని రక్షణఖర్చులకోసం వినియోగించవలసి వస్తోంది; అందువల్ల భారతదేశంయొక్క అభివృద్ధిప్రణాళికలు బలహీనమవుతున్నాయి. ఇట్టి పరిస్థితుల్లో కార్మికవర్గం భారత

ప్రభుత్వంయొక్క శాంతివిధానాన్ని బలపరుస్తుంది. ఏ దేశంనుంచి అయినా సరే షరతులు లేకుండా వచ్చే సహాయాన్ని స్వీకరించడాన్ని సమర్థిస్తుంది. విదేశీ గుత్తపెట్టుబడిదార్ల ప్రాబల్యాన్ని అదుపులో ఉంచే పంథాను ప్రోద్బలమిస్తుంది.

లాటిన్ అమెరికన్ దేశాల విషయ మేమంటే, యిదివరకే చెప్పినట్లు ఈ దేశాల్లో కొత్తరకపు వలస రాజ్యాధిపతులు సైనిక కుట్రలను, తిరుగుబాట్లను ప్రోత్సహిస్తూ, నిరంకుశ ప్రభుత్వాలను గద్దె ఎక్కిస్తూ ఉంటారు. ఇవి పేరుకు మాత్రమే ఆ దేశస్థుల ప్రభుత్వాలు. అమెరికన్ బ్యాంకర చేతుల్లో అవి మెలగుతూ ఉంటాయి. ఆ ప్రభుత్వాలు విదేశీ గుత్తపెట్టుబడిదార్ల ఆస్తులు జాతిపరంకాకుండా కాపాడతాయి; వాటి అధికారాలకు పరిమితులు లేకుండా చూస్తాయి; ఆ దేశాల ప్రజలకు మేలుకలిగే విధంగా స్వతంత్ర మార్గంలో జరగవలసిన ఆర్థికాభివృద్ధిని నిరోధిస్తాయి.

ఈ దేశాల్లో కార్మికవర్గం జాతీయ స్వాతంత్ర్యాన్ని రక్షించుకోనగోరేవా రందరితోను చేతులు కలిపి పోరాడుతుంది; ఈ దేశాల ఆర్థిక రాజకీయ జీవితంపై అమెరికన్ గుత్తపెట్టుబడి దార్లకున్న పెత్తనాన్ని లేదా పలుకుబడిని నిర్మూలించగోరే వారందరితోను కలిసి పోరాడుతుంది.

బ్రిటిష్, ఫ్రెంచి వలసరాజ్యాధిపతులు నూతన పరిస్థితుల్ని కనిపెట్టి కనీసం కొన్ని ఆర్థిక వనరులనైనా తమ పెత్తనం క్రింద ఉంచుకోవాలనే ఉద్దేశంతో మలయా, ఘనా ఫ్రెంచి సుడాన్, ట్యునీషియా, జమైకాలవంటి దేశాలకు కొంత స్వాతంత్ర్యం యిచ్చారు. కాని ఆ స్వాతంత్ర్యానికి వారెట్టె నిబంధనలు విధించా రంటే, ఆ దేశాల ఆర్థిక వ్యవస్థను, పెట్టుబడులను విదేశీ గుత్త పెట్టుబడిదార్లు తమ గుప్పెటలో ఉంచుకోవచ్చు. అంతేకాదు. విదేశీ గుత్తాధిపతుల ప్రయోజనాలకు నష్టం కలుగనంతవరకే ఆ దేశాలు అభివృద్ధి చెందడానికి స్వేచ్ఛ ఉంటుంది.

అందుచేత, యీ దేశాలు స్వతంత్రంగా అభివృద్ధిచెందే సమస్య, అవి యిదివరకే సంపాదించుకున్న స్వతంత్రాధికారాలను విస్తృతపరచుకునే సమస్య ఒకటే. ఈ దేశాల ప్రజలు తమ స్వతంత్రాధికారాలను విస్తృతపరచుకొనేందుకు చేస్తున్నకృషికి ఆ ప్రభుత్వాలు తోడ్పడేటట్లు, విదేశీ గుత్తాధిపత్య సంస్థలను అదుపులో ఉంచేటట్లు చూడవలసిన బాధ్యత కార్మికవర్గంమీద ఉంది. ట్రేడ్‌యూనియన్లు తమ సొంత హక్కులకోసం, ప్రజల స్వతంత్రాధికారాలకోసం జరిపే పోరాటం కొన్ని సందర్భాలలో అత్యంత ప్రధానమైనపాత్ర వహిస్తుంది. ఉదా: మలయాలో బ్రిటిష్ తోటల యజమానులకు వ్యతిరేకంగా; ఘనాలో యూనిలివర్స్ కంపెనీకి వ్యతిరేకంగా; జమైకాలో యునైటెడ్ ఫ్రూట్ కంపెనీకి వ్యతిరేకంగా సాగే పోరాటాలు. ఈ దేశాల ప్రభుత్వాలు కార్మికుల తరఫున నిలబడేటట్లు అంతకంతకు అధికంగా ఒప్పించాలి. రెండోవైపున అవి యింకా ఎక్కువ స్వాతంత్ర్యం సంపాదించడానికి, 'గుత్తాధిపత్యసంస్థల్ని, వాటి దోపిడీని అదుపులో పెట్టడానికి (ఇవే ఆర్థిక, రాజకీయ సంక్షోభాలకు కారణం) చేసే కృషిని బలపరుస్తూ ఉండాలి.

ఆసియాఖండంలో జపాన్ దేశంపట్ల మనం ప్రత్యేకశ్రద్ధ వహించాలి. ఒకనాడు యిదొక బలమైన సామ్రాజ్యవాద దేశంగా ఉండేది. దీని ఆధిపత్యం చైనా, ఆగ్నేయాసియా దేశాలకు విస్తరించింది. కార్మికులకు తక్కువ కూలిరేట్లివ్వడంద్వారాను, సాంకేతిక పద్ధతులను ప్రవేశపెట్టడంద్వారాను జపాన్ యితర దేశాలతో పోటీ చేయగలిగేది.

అలాంటిదేశం నేడు అర్థవలసస్థితికి దిగజారిపోయింది; అమెరికన్ సామ్రాజ్యవాదులు ఆ దేశాన్ని ఆక్రమించుకొని కూర్చున్నారు. ఆ దేశపరిశ్రమలపై పెత్తనం చెలాయిస్తున్నారు. అమెరికన్‌సేనలకు, యుద్ధ స్థావరాలకు అయే ఖర్చులన్నీ జపానే భరించుకోవాలి.

జపాన్ ప్రజలు ముఖ్యంగా కార్మికవర్గం నాయకత్వంక్రింద, అమెరికా ఆక్రమణకు వ్యతిరేకంగా పోరాడుతున్నారు. జపాన్ ప్రజల హక్కులకూ, ఆత్మగౌరవానికీ భంగకరంగా అమెరికన్ సైనికులు చేసే దుర్మార్గాలను ప్రతిఘటిస్తున్నారు. ఇందుకు జపాన్ ప్రజలలో శక్తివంతమైన ఉద్యమాన్ని నడుపుతున్నారు. జపాన్ దేశపు స్వాతంత్ర్యం పునరుద్ధరింపబడేటట్లు, ఆసియాలో అదొక ప్రజా స్వామ్య దేశంగా వర్ధిల్లేటట్లు, యుద్ధాన్నీ, వలసవిధానాన్నీ అది వ్యతిరేకించేటట్లు, శాంతికోసం అది పాటుబడేటట్లు కార్మికవర్గం యితర ప్రజాస్వామశక్తులు కృషిచేస్తున్నాయి.

అదే సమయంలో మన మొక విషయాన్ని గుర్తుంచుకోవాలి. జపాన్ పాలకులు పాతకాలపు జపాన్ సామ్రాజ్యాన్ని పునరుద్ధరించాలని కలలు కంటున్నారు. ఈ ఉద్దేశంతో, అమెరికా సహాయంవల్ల బలపడ్డ జపాన్ గుత్తాధిపత్యసంస్థలు ఆగ్నేయాసియా దేశాల్లో ఆర్థికప్రాబల్యం సంపాదించడానికి ప్రయత్నిస్తున్నాయి. ఈ మధ్య కిషీప్రభుత్వం "ఆగ్నేయాసియా అభివృద్ధినిధి" పేరుతో ఒక ప్రణాళికను తయారుచేసింది. దాని ఉద్దేశం "అమెరికా పెట్టుబడినీ, జపాన్ సాంకేతికపద్ధతుల్నీ" జోడించడం. ఇది అమలు జరిగితే జపాన్ ఒక కొత్తరకపు వలసదోపిడీలో అమెరికన్ గుత్తాధిపత్యసంస్థలకు యిష్టాపూర్వకమైన, చాతుర్యంతో కూడిన కీలుబొమ్మగా ఉపయోగపడుతుంది.

ఇట్టి పరిస్థితుల్లో, జపాన్ కార్మికవర్గం తన క్షేమంకోసం, ప్రాచ్యదేశాల, ఆగ్నేయాసియా దేశాల క్షేమంకోసం ఎంతో ప్రాముఖ్యం వహించే పాత్ర నిర్వహించవలసియుంది. జపాన్ ట్రేడ్‌యూనియన్లు ఐక్యతను సాధించి, అమెరికా, జపాన్ గుత్తాధిపతుల కుట్రను ఓడించి, అమెరికన్ ఆక్రమణ సేనలన్నీ ఉపసంహరింపబడేటట్లు చేస్తే — ప్రజాతంత్ర జపాను, పారిశ్రామికంగా అభివృద్ధిచెందిన జపాను ఆగ్నేయాసియాలో పరిస్థితిని, ప్రాచ్య

దేశాల పరిస్థితిని ఎంతగానో మార్చివేయగల్గుతుంది; శాంతి, స్వాతంత్ర్యం, ఐశ్వర్యాభివృద్ధులకు అది తోడ్పడగల్గుతుంది.

పూర్వం సామ్రాజ్యవాద గుత్తాధిపతులకు సంప్రదాయ సిద్ధంగా కొన్ని ప్రాంతాల్లో బలమైనస్థావరా లుండేవి. కాని సోషలిస్టు చైనా ఆ ప్రాంతాలనుంచి వారిని తరిమివేసింది. మిగతా ప్రాంతాలైనా దక్కుతాయనే ఆశ వారికి కనబడ్డంలేదు. స్వాతంత్ర్యంపొందిన ఇండియా, ఇండొనేషియా, తదితర రాజ్యాల నుంచి ప్రమాదం వారికి అంతకంతకు హెచ్చుతోంది. ఇట్టి పరిస్థితుల్లో సామ్రాజ్యవాద గుత్తాధిపతులంతా తమ దృష్టిని ఆఫ్రికా ఖండంమీద—విస్తారమైన భూభాగం, అపారమైన అవకాశాలు గల ఆఫ్రికా ఖండంమీద—కేంద్రీకరించ నారంభించారు. అంతే కాక, కార్మికవర్గం ట్రేడ్‌యూనియన్ ఉద్యమం అంతకంతకు అభివృద్ధి చెందుతూండడంవల్ల, ఆసియాలో అనేక దేశాలు స్వాతంత్ర్యం సంపాదించుకున్నందున యూరపియన్—అమెరికన్ గుత్తాధిపత్య సంస్థల లాభాలు క్రమక్రమంగా తగ్గిపోతున్నాయి. అణుశక్తిని తయారుచేయడానికవసరమైన ముడిపదార్థాలు ఆఫ్రికా ఎడారులలో కొత్తగా కనుగొనబడ్డాయి. వాటిమీద గుత్తాధిపతులు పెట్టుబడులు పెడుతున్నారు. అక్కడ ఏమాత్రపు సొంత ప్రదేశంఉన్నా, ప్రతి సామ్రాజ్యవాద పెట్టుబడిదారు ఆఫ్రికాను "అభివృద్ధి" చేయడంద్వారా ఊపిరిపోసుకొని బ్రతక చూస్తున్నాడు. సామ్రాజ్యవాదులు ప్రపంచ చరిత్రలో ఒకానొకప్పుడు ఆసియా, ఆఫ్రికా ఖండాలను తమలోతాము విభజించుకొని తద్వారా ప్రాణాల్ని నిలుపుకోగలిగారు. అదేవిధంగా, యీసారికూడా ఆఫ్రికా తమర్ని రక్షిస్తుందని ఆశిస్తున్నారు.

ఈ ఉద్దేశంతోనే వారు "యూరో — ఆఫ్రికన్ ఉమ్మడి మార్కెట్" ప్లాను నొకదాన్ని తయారుచేశారు. దాని ఉద్దేశం, ఆఫ్రికాలో దొరికే ముడిపదార్థాలన్నిటినీ ఉమ్మడిగా యూరపియన్ మార్కెట్లోకి తేవడం. అనేక గుత్తాధిపత్య సంస్థలు ఇండియా,

ఇండోనేషియా, మలయా మొదలైన దేశాల్లో తమకుగల ప్లాంటే షన్లు ఎప్పుడో ఒకప్పుడు జారిపోక తప్పదని తెలుసుకొని, యితర దేశాల్లో రకరకాలైన తోటలు పెంచుతున్నారు. తమక్రింద అణగియుండే హాలెండ్, బెల్జియం, స్పెయిన్, పోర్చుగల్ మొదలైన ప్రభుత్వాలద్వారా దోపిడీలో కొంతవాటా సంపాదించవచ్చునని అమెరికన్ గుత్తాధిపతులు ఆశిస్తున్నారు.

వెనుకబడియున్న ఆఫ్రికాలో చౌకగా లభించే కూలీల శ్రమశక్తిని దోచుకోడంవల్ల, విస్తారంగా దొరికే ముడిపదార్థాలను ఉపయోగించుకోడంవల్ల విపరీతంగా లాభాలు సంపాదించడమేకాక, కొత్తగా స్వాతంత్ర్యం పొందిన దేశాలతో పోటీచేసి, వాటి ఆర్థిక వ్యవస్థలను ఛిన్నాభిన్నం చేయవచ్చుననికూడా సామ్రాజ్యవాదులు అభిప్రాయపడుతున్నారు. ఈవిధంగా ఆసియా ఖండంలోని ప్రజా స్వామ్యశక్తుల్నీ, యూరప్ఖండంలోని కార్మికవర్గాన్నీ లొంగదీసు కోవచ్చునని వారు ఆశిస్తున్నారు.

ఇట్టి పథకాలను దక్షిణాఫ్రికాలోని జాతివిచక్షణప్రభుత్వం, యూరప్ – అమెరికాలలోని గుత్తపెట్టుబడిదారీసంస్థలు బలపరుస్తు న్నాయి. కాని వారి కలలు భగ్నంకాక మానవు. ఇందుకుప్రధాన కారణమేమంటే, సామ్రాజ్యవాద గుత్తాధిపతులు ప్రపంచ దేశాల్ని అభివృద్ధిచేసేందుకు, "ప్రజాస్వామ్యయుతంగా" ఒకరితో ఒకరు "సహకరించుకొన"గల్గితే, తమలో తమకున్న ద్వేషాలను మరచిపోగల్గితే, ప్రపంచంలో గత వందసంవత్సరాల్లోనూ జరిగిన యుద్ధాలు జరిగియుండేవే కావు.

కాని వారు తమలోతాము దెబ్బలాడుకొనేవరకు మనం వేచియుండజాలం; ప్రపంచాన్ని వారు సర్వనాశనం చేయడానికి మన మంగీకరించం. ఆఫ్రికా ఖండంలోని కార్మికవర్గం, ప్రజా స్వామ్యశక్తులు, పీడితప్రజానీకం సామ్రాజ్యవాదుల పెత్తనానికి స్వస్తి చెప్పేందుకు జరిపే పోరాటానికి యావత్ప్రపంచంలోని కార్మికవర్గం ప్రత్యేకంగా సహాయం అందజేయవలసి యుంటుంది.

ఆఫ్రికన్ ప్రజలపై రుద్దబడిన గుత్తాధిపతుల ప్రభుత్వాన్ని, జాతి విచక్షణ ప్రభుత్వాన్ని ఈజిప్ట్, ఇండియా, అరబ్బుదేశాల కష్టజీవులు యూరపియన్ కార్మికుల, సోషలిస్టు దేశాల్లోని కార్మికుల సహాయంతో కూలద్రోయడం తమ ప్రత్యేక బాధ్యతగా పరిగణించాలి.

కొత్తగా స్వాతంత్ర్యంపొందిన దేశాల, యిదివరకే స్వాతంత్ర్యం పొందినప్పటికీ వలసరాజ్యాధిపతులనుంచి కొత్త ప్రమాదాల నెదుర్కొంటున్న దేశాల అభివృద్ధికి సంబంధించిన సమస్యలు యివన్నీ. వలసవిముక్తి పోరాటానికి సంబంధించిన సమస్యలుకూడా యివే.

రెండవ గ్రూపుకు చెందిన దేశాల్లో—అంటే యింకా రాజకీయ స్వాతంత్ర్యం సంపాదించుకోవలసియున్న దేశాల్లో—వలస విముక్తిపోరాటం సామ్రాజ్యవాదులతో ప్రత్యక్షంగా జరపవలసిన పోరాటంగానే ఉంటుంది. ఉదా: అల్జీరియా, సైప్రస్, కెన్యా.

సైప్రస్, కీన్యాలలో బ్రిటిష్ సామ్రాజ్యవాదులు, ఆల్జీరియాలో ఫ్రెంచివారు ఎంతో ఘాతుకమైన హత్యాకాండ జరుపుతున్నారు. తమకున్న ఆయుధశక్తినంతటినీ ప్రజలమీద ఉపయోగిస్తున్నారు. దీన్నిబట్టి వలస రాజ్యాధిపతులు కొన్ని దేశాల్లోను, ప్రాంతాల్లోను రాజ్యాంగసంస్కరణ లిస్తూన్నప్పటికీ వివిధ జాతుల స్వయంనిర్ణయహక్కు పట్ల వారుకన్నరచే "సానుభూతి"ని బాహాటంగా విసర్జించేందుకు వెనుదీయరని అర్థంచేసుకోవచ్చు. జాతీయ విముక్తి ఉద్యమం తమ ప్రధాన ప్రయోజనాలకు ముప్పు తెచ్చిపెట్టినప్పుడు లేదా తమ కీలకస్థావరాలకు అది ప్రమాదకరంగా పరిణమించి నప్పుడు వారు అమానుషమైన బలప్రయోగం ఉపయోగిస్తారనేది స్పష్టం.

ఇతర ప్రాంతాల్లోవలెనే యీ దేశాల్లోకూడ వీరోచిత పోరాటాలు జరిపే ప్రజలు ప్రపంచ ప్రజాస్వామ్యశక్తుల తోడ్పాటుతో సామ్రాజ్యవాదుల పైశాచికపాలనను కూలద్రోయక మానరు.

ఇవీ ట్రేడ్‌యూనియన్ ఉద్యమంయొక్క రాజకీయ కర్తవ్యాలు. ఐతే, కార్మికవర్గంయొక్క పనిపరిస్థితులకు, జీవిత పరిస్థితులకు సంబంధించిన ప్రధాన కోర్కెలు యీడేరకపోతే, హక్కులకు వారి స్వేచ్ఛాస్వత్వాలకు హామీ లేకపోతే, వాటికోసం ట్రేడ్‌యూనియన్లు పోరాడకపోతే—పై రాజకీయ కర్తవ్యాలు అసంపూర్ణంగా ఉండి అమలుజరక్కుండా పోతాయి. అందుచేత ఆ కోర్కెల కోసం జరపవలసిన పోరాటం వలసవిముక్తిపోరాటంలో విడదీయరాని ఒక భాగం.

ఈ సమస్యపైవు మన దృష్టిని ప్రసరింపచేద్దాం.



# 2

# వలస విముక్తికోసం, జాతీయాభివృద్ధికొరకు జరిగే పోరాటంలో కార్మికుల కోర్కెలు

వలస బానిసత్వంక్రింద కార్మికవర్గం యితర వర్గాలవలెనే ఎలాంటి హక్కులూ లేకుండా, తన జీవిత పరిస్థితుల్లో ఎలాంటి అనుకూలమైన మార్పు లేకుండా అనేక బాధలు అనుభవిస్తూ వచ్చింది.

స్వాతంత్ర్యం లభించిన తర్వాత ట్రేడ్‌యూనియన్ హక్కులు, ప్రజాస్వామ్య హక్కులు, పూర్వంకన్న మంచిపరిస్థితులు లభిస్తాయని కార్మికవర్గం ఆశించడం సహజం, అవసరం కూడా.

కాని, కొత్తగా స్వాతంత్ర్యంపొందిన కొన్ని దేశాల్లో ప్రభుత్వాలు బడాబూర్జువావర్గంయొక్క పెత్తనంక్రింద ఉన్నాయి. అవి కార్మికుల దేశభక్తినీ జాతీయాభిమానాన్నీ ఉపయోగించుకొన జూస్తున్నాయి. దేశంకోసం త్యాగాలు చేయవలసిందనీ అధికంగా పని చేయవలసిందనీ కార్మికులకు విజ్ఞప్తి చేస్తున్నాయి. "రేషనలైజేషన్" స్కీములను అంగీకరించమంటున్నాయి. ఎక్కువ పనిభారం మోయుమంటున్నాయి. ఇవన్నీ దేశంయొక్క అభివృద్ధికి అవసరమంటున్నాయి. అంతేకాదు. కార్మికులు ఎక్కువ వేతనాలు అడగకూడదనీ, సమ్మెహక్కును వదలుకోవలసిందనీ. దేశం అభివృద్ధిచెందే వరకు ఎలాంటి కోర్కెలు కోరకూడదనీ కార్మికులను హెచ్చరిస్తున్నాయి. దేశం సిరిసంపదలతో విలసిల్లేవరకు, పరిశ్రమలూ, ఉత్పత్తి

అభివృద్ధిచెందే వరకు, వలసపాలనయొక్క దుష్ఫలితాలు నిర్మూలింపబడేవరకు కార్మికుల పరిస్థితుల్ని చక్కబరచడం సాధ్యంకాదని యీ ప్రభుత్వాలు చెబుతున్నాయి.

ఈ దేశాల్లో పాలకవర్గాలు పై ఆలోచనావిధానాని కనుగుణంగా ట్రేడ్‌యూనియన్ ఉద్యమాన్ని ఆర్గనైజ్‌చేసి నడపాలని చూస్తున్నాయి.

ఒకవైపు వారు కార్మికుల్ని త్యాగాలుచేయమని హితబోధ చేస్తారు. రెండోవైపున యజమానుల, బడాపెట్టుబడిదార్ల దురాశను అదుపులో పెట్టడానికి నిరాకరిస్తారు. దేశంలో ఆర్థిక, రాజకీయ పెత్తనం వీరిదే; రాజ్యాంగయంత్రం వీరి పలుకుబడిక్రింద నే ఉంది. అందుచేత వీరు సాధ్యమైనంత ఎక్కువగాను, త్వరితంగాను ధనం సంపాదించడానికి తమ శక్తియుక్తు లన్నిటినీ వినియోగిస్తారు. ఈ "కొత్త సంపన్నులు" ఇంకా యెక్కువమంది సంపన్నుల్ని తయారుచేయడానికి, తమ పెట్టుబడిని అనేకరెట్లు ఎక్కువ చేసుకోడానికి విపరీతమైన ప్రయత్నాలు చేస్తున్నారు. చివరకు పరిస్థితి యెలా తయారైందంటే, జాతీయార్థికాభివృద్ధికి వారు తయారు చేసిన పథకాలే తారుమారయే ప్రమాద మేర్పడుతూంది; అనేక మంది నిరాశాపూరితు లవుతున్నారు; సర్వనాశనంతప్ప మరొకటి కనిపించడంలేదు—చివరకు వీరికికూడా.

ఇట్టి పరిస్థితుల్లో ట్రేడ్‌యూనియన్లు ప్రజలకు నిజంగా ఉపయోగపడే అభివృద్ధి ప్రణాళికలను అమలుజరపడంలో సహకరిస్తూ, పెట్టుబడిదారీవర్గం న్యాయమైన లాభాలు సంపాదించుకోడాని కంగీకరిస్తూ రెండోవైపున జాతీయాదాయంలో తమకు న్యాయంగారావలసిన భాగాన్ని కోరవలసియుంటుంది. జాతీయ ప్రయోజనాలదృష్ట్యా యిది సహజం, అవసరంకూడా. అందుచేత ట్రేడ్‌యూనియన్లు వేతనాల పెంపుదల, పని పరిస్థితులను మెరుగుపరచడం, ప్రజాస్వామ్య హక్కులను గుర్తించడం మొదలైన కోర్కెలకోసం కృషిచేస్తూ ఉండవలసిందే. ఒకవైపు జాతీయప్రయోజనాలను

కాపాడుతూనే, మరోవైపు ట్రేడ్‌యూనియన్లు కార్మికుల, తదితర కష్టజీవుల, ఆర్థిక, సాంఘిక ప్రయోజనాలను రక్షించడానికి శ్రద్ధతో పనిచేయవలసి యుంటుంది.

ఇదివరకే స్వాతంత్ర్యంపొందిన అనేక దేశాల్లో వలసవిధానానికి వ్యతిరేకంగా మొత్తం జాతిఅంతా పోరాడ్డం, ఆసందర్భంలో ప్రజాస్వామ్యఉద్యమం కార్మికోద్యమ , ఎంతో బలపడ్డం జరిగింది. అట్టి దేశాలు ఆర్థికాభివృద్ధికి కొన్ని ప్రణాళికలు తయారుచేశాయి; విదేశీ గుత్తాధిపత్యసంస్థలను కొంతవరకు అదుపులో ఉంచాయి. ఆహారధాన్యాలను, ముడిపదార్థాలను అధికంగా-ఉత్పత్తిచేయడానికి కొన్ని భూసంస్కరణలను ప్రవేశపెట్టాయి; సోషలిస్టుదేశాలతో ఆర్థిక సహకార సంబంధాలు స్థాపించుకున్నాయి. అంతేకాదు, ప్రజాస్వామ్యహక్కుల విషయంలో కొంత పురోభివృద్ధికూడా జరిగింది. సోషలిస్టుదేశాలతో సహకరిస్తూండడంవల్ల యీ దేశాలు ఆర్థికంగా అభివృద్ధి చెందడానికి, తాము సంపాదించుకున్న స్వాతంత్ర్యాన్ని కాపాడుకోడానికి వీలు కలిగింది. విదేశీ గుత్తపెట్టుబడిదార్లుపెట్టేఆటంకాలవల్ల యీదేశాల ఆర్థికవిధానం, ద్రవ్యవిధానం ప్రతిష్ఠంభనలో యిరుక్కోవడం తరచు జరుగుతూ ఉండేది. ఈ పరిస్థితిని అధిగమించడానికి సోషలిస్టుదేశాలనుంచితీసుకొంటున్న సహాయం కొంతవరకు తోడ్పడుతూంది.

ఐనప్పటికీ యీ దేశాల ప్రభుత్వాలు విదేశీ గుత్తాధిపతుల నుంచి ఆర్థికసహాయం పొందవచ్చుననే ఆశను పూర్తిగా ఒదులుకోవు. కొత్తగా స్వాతంత్ర్యంపొందిన దేశాల్లో కొందరు గుత్తపెట్టుబడిదార్లు ప్రభుత్వరంగం చేయబడిన పరిశ్రమల అభివృద్ధిని వ్యతిరేకిస్తారు. అంతేకాక, విదేశీపెట్టుబడిదార్ల పరిశ్రమలను జాతీయం చేయబోమనీ, కార్మికుల కోర్కెలను నిరాకరిస్తామనీ హామీలుకూడా యిస్తారు. తమ పథకాలను తాము అమలజరుపుకోడానికి వీలుగా "తమ సొంత" ట్రేడ్‌యూనియన్లను స్థాపిస్తారు; ప్రజల నిత్యజీవితాలకు హానికలిగించే విదేశీ గుత్తపెట్టుబడిదార్ల

చర్యలను ఎవ్వరూ ప్రతిఘటించకుండా చూడ్డానికి పూచీపడతారు. కాని యీ ప్రయత్నాలు భగ్నమై తీరుతాయి. కార్మికవర్గం తన ప్రయోజనాలను, తన దేశ ప్రయోజనాలను రక్షించుకోడానికి పోరాడకమానదు.

సైనిక కూటములలో చేరిన దేశాల్లో కార్మికవర్గం యింకా గురుతరమైన ఆర్థిక, సాంఘిక సమస్యల నెదుర్కోవలసి యుంటుంది.

ఈ దేశాల ఆర్థిక జీవనాడులన్నీ విదేశీ గుత్తపెట్టుబడిదార్ల చేతుల్లో ఉన్నాయి. వలసరాజ్యాధిపతులు వీటికిచేసే ఆర్థికసహాయం సైనిక ఒడంబడికలతోను, సైనిక లక్ష్యాలతోను ముడిపడిఉంటుంది. అందుచేత యీ దేశాలు రాజకయంగాను ఆర్థికంగాను, ద్రవ్య విషయాల్లోను చాలవరకు విదేశీ గుత్తాధిపతులమీద ఆధారపడి యుంటాయి. విదేశీ గుత్తాధిపతుల పెట్టుబడులు యీ దేశాల వనరులన్నిటినీ కొల్లగొట్టుకొని పోడానికే ఉపయోగపడతాయి. ఒకవైపు విదేశీ పెట్టుబడులు విపరీతమైన లాభాలు సంపాదించి పెడుతూవుంటే మరోవైపు యీ దేశాల ఆర్థికవ్యవస్థ యిదివరకెన్నడూ లేనంతగా ఛిన్నాభిన్నమవుతోంది. కార్మికుల పరిస్థితి బాగుపడ్డంమాట అటుంచి మరింత అధ్వాన్నంగా తయారవుతూంది.

ఈ దేశాల్లో సైనికకూటముల బంధనాలవల్ల, విదేశీ పెట్టుబడుల కంట్రోలువల్ల తరచు ట్రేడ్‌యూనియన్ హక్కులు దారుణంగా అపహరింపబడుతున్నాయి. అనేక లాటిన్ అమెరికన్ దేశాల్లో 1954 తర్వాత—కారకాస్‌లో జరిగిన అఖండ అమెరికా మహాసభ తర్వాత, గౌతమాలాపై జరిగిన సైనిక దురాక్రమణ తర్వాత — ట్రేడ్‌యూనియన్ హక్కులు మరీ క్రూరంగాను తరచుగాను ఉల్లంఘింపబడుతున్నాయి. గౌతమాలాలోని జనరల్ కాన్ఫెడరేషన్ ఆఫ్ వర్కర్స్, నేషనల్ ఫెడరేషన్ ఆఫ్ పెజెంట్స్ అను కార్మిక కర్షక సంస్థలు రద్దుచేయబడ్డాయి; వాటి నాయకులు జైళ్లలో నిర్బంధింపబడ్డమో, క్రూరంగా హింసింపబడ్డమో జరిగింది.

క్యూబా నియంత బాప్టిస్టా సైనికులచేత ట్రేడ్‌యూనియన్ కార్యాలయాలను ఆక్రమింపజేశాడు; కార్మికులచే ఎన్నుకోబడిన నాయకుల స్థానే అధికార ప్రతినిధుల్ని నియమించాడు. 1956 లో క్రిస్టమస్ పండగనాడు బాప్టిస్టా పంపిన పోలీసులు 22 మంది కార్మికుల్ని హత్య చేశారు. వెనెజులాలో వందలాది కార్యకర్తలైన ట్రేడ్‌యూనియనిస్టులు జైళ్ళలో నిర్బంధింపబడ్డమో, దేశంనుంచి బహిష్కరింపబడ్డమో జరిగింది. ఛిలీ ప్రభుత్వం ట్రేడ్‌యూనియన్ ఉద్యమాన్ని అణచేటందుకు, చాల పెద్దసంఖ్యలో కార్మికుల్ని, చురుగ్గా పనిచేసే ట్రేడ్‌యూనియన్ సభ్యుల్ని అరెస్టు చేసేటందుకు ప్రజాస్వామ్య పరిరక్షణ చట్టాన్ని విచ్చలవిడిగా ఉపయోగించింది. పెరాగువా, కొలంబియా, అర్జెంటైనా మొదలైన దేశాల్లో ట్రేడ్‌యూనియన్ హక్కులు నిరంతరం అపహరింపబడుతున్నాయి.

విదేశీకంపెనీల పోటీవల్ల అనేక దేశీయసంస్థలు దివాళాతీసే స్థితిలో ఉన్నాయి; నిరుద్యోగసమస్య చాల తీవ్రరూపం దాల్చింది. విదేశ వ్యాపారం ఎన్నో మార్కెట్‌యిబ్బందులకు గురిఅవుతోంది. దీనికితోడు ఎగుమతులపై నిషేధాలు, తదితర ఆంక్షలు అమలులో ఉన్నాయి.

పై రెండురకాలైన దేశాల్లో ట్రేడ్‌యూనియన్ ఉద్యమం పైన వివరించిన ఆర్థిక, సాంఘిక పరిస్థితుల్ని దృష్టిలో ఉంచుకొని యీ క్రింది ప్రధానకోర్కెలను ముందుకు తెచ్చింది :

—వేతనాలు పెంచాలి; కనీసవేతనం గ్యారంటీచేయాలి.

—పనిభారాన్ని హెచ్చించేటందుకు, కార్మికుల్ని బర్తరఫు చేసేటందుకు ఉద్దేశింపబడిన రేషనలైజేషను స్కీములను ఉపసంహరించుకోవాలి.

—నిరుద్యోగ సమస్యను పరిష్కరించాలి; అందరికీ పనులు చూపాలి.

—జీవితావసర వస్తువుల ధరలను తగ్గించి స్థిరీకరించాలి.

—ప్రజాస్వామ్యహక్కులు, ట్రేడ్‌యూనియన్ హక్కులు పూర్తిగా రక్షింపబడాలి.

—కార్మిక చట్టాలను ప్రవేశపెట్టాలి; సాంఘికభద్రతకు అవసరమయే స్కీములను ప్రతిపాదించాలి; ఉన్నవాటిని మెరుగు పరచాలి.

—పనిగంటలు తగ్గించాలి; జీతంతో సెలవులు యివ్వాలి.

—ఇండ్లవసతిని చక్కబరచాలి.

వలసదేశాల సమస్య మరోవిధంగా ఉంటుంది. ఈ దేశాలు జాతీయ స్వాతంత్ర్యాన్ని సంపాదించుకోడం ప్రధాన సమస్య. ప్రస్తుతం అనేకవలసదేశాలు అమానుషమైన యుద్ధాలలో, సైనిక నిర్బంధాలలో యిరుక్కొని ఉన్నాయి. ఇట్టి పరిస్థితుల్లో కార్మికులు అత్యంత ప్రధానమైన ఆర్థిక, సాంఘిక సమస్యల నెదుర్కోవలసియుంది.

ఈ దేశాల్లో పెద్ద పరిశ్రమలన్నీ విదేశీ గుత్తపెట్టుబడి దార్లవి. సాగుభూమిలో అధికభాగం వలస రాజ్యాధిపతులది.

అనేక వలసదేశాల్లో సామ్రాజ్యవాదులు ఆర్థికాభివృద్ధి కోసమంటూ కొన్ని ప్రణాళికలను అమలుజరుపుతున్నారు. కాని అసలు విషయమేమంటే, వాటివల్ల గుత్తపెట్టుబడిదార్ల లాభాలు క్రమక్రమంగా పెరుగుతున్నాయి. ప్రజాసామాన్యం అంతకంతకు అధికంగా పీడింపబడుతున్నారు.

అనేకదేశాల్లో జాతివిచక్షణ విధానం చాల తీవ్రరూపంలో అమలుజరుగుతోంది. దేశీయులు సాంఘిక రాజకీయ కార్య కలాపాలనుంచి దూరంచేయబడ్డమో, జాతివిచక్షణకు లోనుచేయ బడ్డమో జరుగుతోంది. వృత్తి విద్య, సాధారణవిద్య విషయంలో కూడ యిలాగే జరుగుతోంది.

దేశీయకార్మికుల జీతాలు చాల తక్కువ. ఉదాహరణకు ఆఫ్రికాలో యూరపియన్ కార్మికులకిచ్చే జీతంలో 1/10 నుంచి 1/20 మాత్రమే దేశీయులకిస్తారు. ఉత్తర రొడీషియన్ రాగి

గనుల్లో దేశీయులకిచ్చే సగటు జీతం నెలకు 8,500 ఫ్రాంకులు; యూరపియన్ కార్మికుల కిచ్చేది 1,20,000 ఫ్రాంకులు.

దేశీయకార్మికుల కింత తక్కువ జీతాలిస్తూండడంవల్ల పుష్టికరమైన ఆహారం వారికి లభించదు. ఎల్లప్పుడూ అర్ధాకలితో జీవిస్తారు. వారు నివసించే యిండ్లు చాల అధ్వాన్నంగా ఉంటాయి. రోగాలు విపరీతం. కొన్ని ప్రాంతాల్లో యిప్పటికీ వెట్టిచాకిరీ అమల్లో ఉంది.

ఈ దేశాల్లో వలసరాజ్యాధిపతులు ట్రేడ్‌యూనియన్ హక్కులను దారుణంగా హరించివేస్తున్నారు. కొన్ని ప్రాంతాల్లో అసలు ట్రేడ్‌యూనియన్లే లేవు. ఇతర చోట్ల వలసరాజ్యాధిపతులు విధించే నిబంధనలకు లోబడి ట్రేడ్‌యూనియన్లు పనిచేయాలి.

పై గ్రూపులకుచెందిన దేశాల్లోను, వ్యక్తిగతంగా ఒక్కొక్క దేశంలోను కార్మికుల ఆర్థిక సాంఘిక కోర్కెలు ప్రత్యేక లక్షణాలను కలిగియున్నప్పటికీ, ప్రస్తుతం చాల హీనంగా ఉన్న కార్మిక పరిస్థితులను మెరుగుపరచాలనేది వారి ఏకైక కోర్కె; తక్షణ కోర్కె. వారి బాధలకు మూలం వలసవిధానమనే వ్యాధి. అందుచేత, యీ దేశాల్లో ట్రేడ్‌యూనియన్ ఉద్యమం రెండు కర్తవ్యాలను నిర్వర్తించవలసియుంది. ఒకటి: వలస రాజ్యాధిపతుల ప్రత్యక్షపాలనను తుదముట్టించేందుకు పోరాడ్డం. రెండు: తమ హక్కులను రక్షించుకొనేందుకు కృషిసల్పడం.

*

# 3

# ట్రేడ్‌యూనియన్ ఉద్యమం వలసవిధానానికి వ్యతిరేకంగా కార్మికుల శ్రేయస్సుకొరకు పోరాడుతూ పొందుతున్న అభివృద్ధి

ఆసియా, ఆఫ్రికా, లాటిన్ అమెరికాలలో వలసవిధానానికి వ్యతిరేకంగా జాతీయ విముక్తికొరకు, స్వాతంత్ర్య రక్షణకొరకు జరిగే పోరాటాల్లో కార్మికవర్గం, ట్రేడ్‌యూనియన్లు చురుగ్గా పాల్గొన్నాయి; తరచు అవి అగ్రశేణిలో నిలబడ్డాయి. అదే సమయంలో యీ దేశాలలోని ట్రేడ్‌యూనియన్లు కార్మికుల ప్రయోజనాలను కాపాడేందుకు అనేక పోరాటాలు జరిపి,విజయాలు సాధించాయి. ఈ పోరాటాల్లో ట్రేడ్‌యూనియన్ ఉద్యమం మొత్తంమీద అభివృద్ధి చెందింది; చాల ప్రధానమైన అనుభవాలు - ముఖ్యంగా ట్రేడ్‌యూనియన్ ఐక్యతకు సంబంధించినవి—సంపాదించింది.

గత 4 సంవత్సరాల్లోను యీ దేశాల్లో జరిగిన కార్మిక పోరాటాల, ట్రేడ్‌యూనియన్ ఉద్యమాల అభివృద్ధికి సంబంధించిన ప్రధాన ధోరణులనుగురించి మొదట తెలుసుకుందాం.

## ఆగ్నేయాసియా

భారతదేశంలో 1955,తర్వాత కార్మికులు, ట్రేడ్‌యూనియన్లలో అత్యధికభాగం గోవాను భారతదేశానికి స్వాధీనం చేయాలనే నినాదంపై జరిగిన పోరాటంలో చురుగ్గా పాల్గొన్నారు.

అనేక నగరాలలో కార్మికులు గోవా భూభాగంలో ప్రవేశించడానికి ప్రయత్నించారు; చాలచోట్ల సమ్మెలు, ప్రదర్శనలు జరిగాయి. ఒక్క బొంబాయిలోనే 5,00,000 మంది కార్మికులు వివిధ ధోరణుల ట్రేడ్‌యూనియన్ల పిలుపునందుకొని సర్వవ్యాపిత సమ్మెలు జరిపారు.

1956 లో జరిగిన మరొక ప్రధానమైన పోరాటం భాషల ప్రాతిపదికపై రాష్ట్రాలను పునర్విభజించాలనేది. దీనివల్ల, బ్రిటిష్ సామ్రాజ్యవాదులు పరిపాలనా సౌలభ్యంకొరకు కృత్రిమంగా విభజించిన రాష్ట్రాలు రద్దుచేయబడతాయి; భారతదేశపు ఆర్థిక వ్యవస్థ, ప్రజాస్వామ్య సంస్థలు, ప్రజల సంస్కృతి త్వరితంగా అభివృద్ధి చెందుతాయి.

1957 లో జరిగిన సాధారణ ఎన్నికల్లో భారత కార్మికవర్గం కొన్ని ముఖ్యమైన విజయాలను సాధించిన విషయం యీ సందర్భంలో గమనార్హం. రాష్ట్ర శాసనసభలకు, కేంద్ర పార్లమెంటుకు ఎన్నుకోబడిన వారిలో 41 మంది సభ్యులు అఖిలభారత ట్రేడ్ యూనియన్ కాంగ్రెసుకు చెందినవారు; లేదా ఆ సంస్థచే బలపరచబడినవారు. భారతప్రజల జాతీయ ప్రయోజనాలను, కార్మికుల హక్కులను రక్షించే విషయంలో ట్రేడ్‌యూనియన్ ఉద్యమానికిదొక అనుకూలమైన అంశం. అంతేకాదు. ఎన్నికల అనంతరం కార్మికవర్గ ప్రతినిధులచే నడుపబడుతున్న కేరళప్రభుత్వం వలస విధాన అవశేషాలను నిర్మూలించేందుకు, కష్టజీవుల పరిస్థితిని బాగుపరచేందుకు అనేక చర్యలు తీసుకొంది. కార్మికులు సాధించిన ఈ విజయాన్ని భారతదేశ ప్రజలేకాక యితరదేశాల ప్రజలుకూడ ఒక ప్రధాన విషయంగా పరిగణిస్తున్నారు.

భారతదేశ కార్మికులు తమ జీవిత పరిస్థితులను, పని పరిస్థితులను మెరుగుపరచుకోడానికి కూడా అనేక ప్రధానమైన పోరాటాలు జరిపారు. భారతదేశ కార్మికులు తమ జీవితపరిస్థితులను, పని పరిస్థితులను మెరుగుపరచుకోడానికి కూడా అనేక ప్రధానమైన పోరాటాలు

జరిపారు. ఉదాహరణకు కాన్పూరు జౌళికార్మికులు 82 రోజులు వరుసగా సమ్మెచేశారు; అమృతసర్ జౌళికార్మికులు 36 రోజులు సమ్మెచేశారు; డార్జిలింగ్‌లో 2.00.000 మంది తేయాకు కార్మికులు, దక్షిణఇండియాలో మరికొందరు తేయాకుకార్మికులు చేసిన బ్రహ్మాండమైన సమ్మె విదేశీ గుత్తపెట్టుబడిదార్లను సూటిగా దెబ్బకొట్టింది; కేరళ తదితర రాష్ట్రాలలో ప్లాంటేషన్ కార్మికులు జరిపిన సమ్మె ఫలించడంవల్ల బోనసురూపంలో వారు కొన్ని లక్షల రూపాయల ధనం రాబట్టుకోగలిగారు; 3,60,000 మంది బొగ్గుకార్మికులు జీతాల పెంపుదలకోసం పోరాడి, 100 కి 40 చొప్పున హెచ్చు జీతాలు రాబట్టుకోగలిగారు; బర్న్‌పూర్ ఇనుము - ఉక్కు-పరిశ్రమలో పనిచేసే కార్మికులు, తాతా లోకొమోటివ్ అండ్ టిన్‌ప్లేట్ కర్మాగారంలో పనిచేసేవారు కూడా సమ్మెపోరాటాలు జరిపారు. ఈ పోరాటాల్లో అధికభాగం కొద్దో గొప్పో ఫలించాయి. అనేక సమ్మెలలో మనకు కనిపించే లక్షణమేమంటే, అన్ని కార్మికసంస్థల మధ్య లేదా అధిక సంఖ్యాకసంస్థలమధ్య ఆచరణలో ఐక్యత సాధ్యపడింది. ఈ ఐక్యత పోరాటాల్లో విజయం సాధించడానికేకాక, ట్రేడ్‌యూనియన్ ఐక్యతకుకూడా ఎంతో తోడ్పడింది.

గత సంవత్సరం దేశవ్యాపితంగా కార్మికులలో ట్రేడ్ యూనియన్ చైతన్యం, సంఘ నిర్మాణం బాగా పెరిగింది. జీతాలను పెంచాలనే ఉద్యమం అంతకంతకు అభివృద్ది చెందింది. ఎంతో త్వరితంగా పురోగమిస్తూన్న యీ ఉద్యమంలో మధ్యతరగతి ఉద్యోగులుకూడా ముందుకొచ్చారు. అదివరదాకా వెనుకబడియున్న ప్రాంతాలు యీసారి పోరాట వెల్లువలో చేరాయి. సాధారణ కార్మికులు యిదివరకుకన్న అధికంగా ఐక్యకార్యాచరణకై సంఘటితులవడం మనకు కనిపిస్తుంది. ఇందుకు కొన్ని ముఖ్యమైన ఉదాహరణలు: కాన్పూరులో ఐక్య జౌళికార్మికుల సంఘ స్థాపన; పశ్చిమబెంగాల్‌లోను అనేక గనిప్రాంతాల్లోను

ప్లాంటేషన్లలోను ఐక్య నిరసన ప్రదర్శనలు. 1957 లో పోస్టల్ అండ్ టెలిగ్రాఫ్ పనివారు జీతాల పెంపుదలకోసం, సర్వీసు స్థితిగతుల్లో మార్పుకోసం మొట్టమొదటిసారిగా జరిపిన పోరాటం భారతదేశంలోని కేంద్ర ప్రభుత్వోద్యోగులందరు ఒకే సంస్థలో సంఘటితులవడానికి తోడ్పడింది (కాన్ఫెడరేషన్ ఆఫ్ సెంట్రల్ గవర్నమెంట్ సర్వీస్ ఎంప్లాయీస్ యూనియన్); వారి కోర్కెలలో కొన్ని ఫలించాయి; ప్రభుత్వోద్యోగులకూ, కార్మిక ప్రజాసామాన్యానికీ మధ్య — ముఖ్యంగా మధ్యతరగతి ఉద్యోగుల మధ్య — ఒక నూతన ఐక్యత నిర్మింపబడింది.

ఇలాగే గుత్తపెట్టుబడిదార్లు తాము సంపాదించిన విపరీత లాభాల్లో కొంతభాగాన్ని కార్మికుల కీయక తప్పిందికాదు. ప్రభుత్వం తరచు సమ్మెలను, కార్మికుల—విద్యార్థుల ప్రదర్శనలపై తుపాకులు కాల్చేందుకు పోలీసుల్ని పంపడం, కాల్పులలో పలువురు మరణించడం చాలకాలంనుంచి జరుగుతోంది. దీనికి వ్యతిరేకంగా అన్నితరగతుల ప్రజల్లోను, పార్లమెంటులో అన్ని రాజకీయపార్టీలలోను బ్రహ్మాండమైన ఆందోళన రేగింది. ఈ ఒత్తిడి ప్రభుత్వం మీద పనిచేసింది. పై అమానుష పద్ధతికి స్వస్తిచెప్పబడుతుందని ప్రభుత్వం వాగ్దానం చేసింది. ప్రజోపయోగ సర్వీసులలో సమ్మెలను నిషేధించే రెగ్యులేషన్ చాలకాలం అమల్లో ఉండేది. ప్రభుత్వోద్యోగుల సమ్మెలను నివారించడాని కది ఉద్దేశింపబడింది. ఈ రెగ్యులేషన్ని ప్రభుత్వం లోగడ ఉపసంహరించుకొంది. ఐతే దాని స్థానంలో మరో రెగ్యులేషన్ జారీచేసింది. దాని ప్రకారం ప్రభుత్వోద్యోగు లెవరూ ఊరేగింపులలోగాని, పబ్లిక్ కార్యాలలోగాని పాల్గొనకూడదు.

ఈజిప్ట్పై సామ్రాజ్యవాదుల దండయాత్ర ప్రారంభమైనప్పుడు అనేక పట్టణాలలో కార్మికులు నిరసన సభలు, ఊరేగింపులు జరిపారు. అంతర్జాతీయ మితవాద కార్మికసంస్థ ఐన ఐ. సి. ఎఫ్. టి. యు. బాగ్దాద్ సైనికకూటమిని, ఆగ్నే

యూపియా సైనికకూటమిని సమర్థిస్తూ వచ్చింది. ఈ విధానంపట్ల జాతీయ ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్ ప్రతినిధులు, హింద్ మజ్దూర్ సభ ప్రతినిధులు, ఐ. సి. ఎఫ్. టి. యు. కౌన్సిల్‌లో తమ అసమ్మతిని ప్రకటించారు.

ఇండొనేషియా కార్మికులు 1955 సాధారణ ఎన్నికల్లోను, 1957 లో జావాలో జరిగిన స్థానిక ఎన్నికల్లోను పాల్గొన్నారు. కార్మికవర్గానికి, యితర ప్రజాస్వామ్యశక్తులకు గణనీయమైన విజయాలు లభించాయి. దేశరాజకీయాల్లో కార్మికవర్గం ఒక బలమైన శక్తిగా నిరూపించుకొంది.

ఈమధ్య సామ్రాజ్యవాదుల ప్రోద్బలంతో సాయుధ తిరుగుబాట్లు జరిగినప్పుడు ఇండొనేషియా కార్మిక సమాఖ్య (సోబ్సి) సామ్రాజ్యవాదుల విచ్ఛిన్న చర్యలకు, కుట్రలకు వ్యతిరేకంగా దేశాభిమానులందరితో కలిసి పోరాడింది. చివరకు కేంద్రప్రభుత్వం అలాంటి చర్యలను అణచేందుకు తీసుకున్న చర్యలను హృదయపూర్వకంగా బలపరిచింది. ఇండొనేషియా అధ్యక్షుడు దేశంలో ప్రజాస్వామ్యం, ఐక్యత వర్ధిల్లేటట్లు చేయడానికి రూపొందించిన పథకాన్నికూడా కార్మికవర్గం బలపరిచింది. దక్షిణ సుమత్రాలో తిరుగుబాటు జరిగినప్పుడు ఇండొనేషియా కార్మిక సమాఖ్య రాజకీయ సర్వవ్యాప్త సమ్మెను నడిపింది. ఈ విధంగా కార్మికవర్గం యొక్క సహకారంవల్ల ఆ ప్రాంతంలో పరిస్థితి క్రమంగా సద్దుకుంది. ఇండొనేషియా కార్మిక సమాఖ్య జాతీయ స్వాతంత్ర్యాన్నీ ఐక్యతనూ కాపాడేందుకు గట్టిగా కృషిచేయడం చూచి దుండగులు దాని కార్యాలయంమీద దాడిచేశారు; సుమత్రాలో కొందరు కార్యకర్తలు అరెస్టు చేయబడ్డారు. కాని యిట్టి చర్యలు స్వాతంత్ర్యరక్షణకు కంకణం కట్టుకున్న ఇండొనేషియన్ కార్మికుల మనోనిశ్చయాన్ని చెడగొట్టలేక పోయాయి. ఇండొనేషియన్ కార్మిక సమాఖ్య కార్మికుల్నీ కార్మిక సంఘాల్నీ ఐక్యపరుస్తూ దేశంలో సుస్థిరతను నెలకొల్పడానికి, రౌండు టేబుల్ ఒడంబడికను రద్దు

చేయాలనే నిర్ణయాన్ని అమలు జరిపించేందుకు, పశ్చిమ ఇరియన్ దీవుల్ని డచ్చివారినుంచి స్వాధీనమొనర్చుకొనేటందుకు, విదేశీ కంపెనీలను జాతిపరంచేసేటందుకు, సంపూర్ణ స్వాతంత్ర్య సాధనకు, కార్మికుల స్థితిగతులను బాగుపరచేటందుకు, జీతాల పెంపుదల కొరకు, సాంఘిక భద్రతకోసం, జీవితావసర వస్తువుల ధరలను తగ్గించి స్థిరపరచేటందుకు — తీవ్రమైన పోరాటం కొనసాగిస్తూనే ఉంది.

గత కొద్ది సంవత్సరాల్లో ఇండొనేషియన్ ట్రేడ్‌యూనియన్ ఉద్యమం చాలా బలపడింది. సంఘటితంకాని కార్మికులు అనేకమంది ట్రేడ్‌యూనియన్లలో సభ్యులుగా చేరారు. ఇండొనేషియన్ కార్మికసమాఖ్య, యితర ట్రేడ్‌యూనియన్‌సంస్థలు ఐక్యతకోసం నడిపిన ఉద్యమాలు ఎంతో అభివృద్ధి చెందాయి. ప్రభుత్వ కార్యాలయాల్లోను, ప్రభుత్వపరిశ్రమల్లోను పనిచేసే ట్రేడ్ యూనియన్లన్నిటికీ ఒక సమన్వయసంస్థ ఉంది. (సెంట్రల్ కాన్ఫరెన్స్ ఆఫ్ కోఆపరేషన్). దానికి అనుబంధింపబడిన సంస్థలు 63 వరకు ఉన్నాయి. దేశం మొత్తంమీద ఉన్న ప్రభుత్వోద్యోగులలో 100 కి 95 మంది వీటిలో సభ్యులుగా ఉన్నారు. ఈయేడు విదేశీకంపెనీలలో పనిచేసే ఉద్యోగులుకూడా ఒక కేంద్రసమన్వయ సంఘాన్ని స్థాపించుకున్నారు. ఇంచుమించు అన్ని పారిశ్రామికసంస్థల్లోను కార్మికులు ఐక్యకార్యాచరణకు పూనుకోడం కనిపిస్తుంది. విభిన్న ట్రేడ్‌యూనియన్ సమాఖ్యల మధ్య ఉమ్మడిసమస్యలపై అన్యోన్య సహకారం, స్నేహసంబంధాలు పెంపొందుతున్నాయి.

కార్మికుల హక్కులకై జరిగే పోరాటాల్లో అన్ని ట్రేడ్ యూనియన్లూ ఐక్యతతో పనిచేయడంవల్ల అనేక విజయాలు లభించాయి. ఉదాహరణకు 1955 లో విదేశీ కంపెనీలలోని పనివారు తమ జీతాలను సగటున 100 కి 20 చొప్పున హెచ్చించుకో గలిగారు; సంవత్సరాంతంలో ఒక నెల జీతం బోనస్‌గా సంపాదించు

కోగలిగారు. అదే సంవత్సరంలో 1,80,000 మంది వ్యవసాయ కార్మికులు సంవత్సరాంతంలో బోనసు సంపాదించుకోగలిగారు. 1956 లో ప్రభుత్వోద్యోగులు జీతాలకు సంబంధించిన కొత్త నిబంధనలను సాధించుకోగలిగారు. 1957 లో 16 వ నెంబరు ఎమర్జెన్సీ నిబంధనను రద్దుచేయించుకోగలిగారు. దాని ప్రకారం ప్రభుత్వోద్యోగులు సమ్మె చేయరాదు.

బర్మాలో 1955 నుంచీ ట్రేడ్‌యూనియన్ ఉద్యమం పురోగమిస్తోంది. ఆయేడు సమ్మెల సంఖ్య 1954 లో కంటె 100 కి 50 చొప్పున హెచ్చింది. బ్రిటిష్ గుత్తపెట్టుబడిదార ప్రయోజనాలకు వ్యతిరేకంగా నూనె పరిశ్రమలోని కార్మికులు జరిపిన పోరాటం సుమారు ఒక సంవత్సరం కొనసాగింది. రెండు బ్రహ్మాండమైన సర్వవ్యాపిత సమ్మెల ఫలితంగా, కార్మికులు సంపూర్ణ విజయం సాధించారు. ట్రేడ్‌యూనియన్ ఐక్యతకూడా వృద్ధి చెందింది. 1954 లో రైల్వేకార్మికుల సంఘంలో ఏర్పడ్డ చీలిక 1956 జనవరిలో అంతమై, తిరిగి ఐక్యత నెలకొల్పబడింది.

మలయాలో 1955 తర్వాత జాతీయ స్వాతంత్ర్యోద్యమం బ్రహ్మాండంగా పురోగమించింది. దానివల్ల ట్రేడ్‌యూనియన్ ఉద్యమంలో ఒక గొప్ప వెల్లువ వచ్చింది. ప్రభుత్వ లెక్కల ప్రకారం 1955 లో సింగపూరులో 275 సమ్మెలు జరిగాయి; వాటి ఫలితంగా 9 40,000 రోజుల పని ఆగిపోయింది. 1956 మేమాసంలో 8,20,000 మంది రబ్బరు ప్లాంటేషన్ కార్మికులు మందకొడిగా పని చేసే ఉద్యమం ప్రారంభించారు; అది 5 వారాలపాటు కొనసాగింది. 1956 జూలైలో 60 తగరపు గనులలో పనిచేసే 18,000 మంది కార్మికులు సమ్మెచేశారు. ఈ పోరాటాల్లో ఐక్యకార్యాచరణ చాల వరకు అభివృద్ధి చెందింది. ఉదాహరణకు సింగపూర్‌లో సుమారు 100 ట్రేడ్‌యూనియన్ల ప్రతినిధులతో ఒక ఐక్యకార్యాచరణ సమితి ఏర్పడింది. అత్యవసర నిబంధనల రద్దుకోసం ట్రేడ్‌యూనియన్ నాయకుల విడుదలకోసం అనేక సంఘాలు పోరాటాలు జరి

పాయి. ఈ మధ్య మలయాను స్వతంత్ర దేశంగా గుర్తిస్తూ బ్రిటిష్ ప్రభుత్వం చేసిన ప్రకటనకు కారణం చాలవరకు కార్మిక పోరాటాలే. ఈ విధంగా కార్మిక పోరాటాలు అంతకంతకు తీవ్రమవడం చూచి వలస రాజ్యాధిపతులు 1956 తర్వాత మరింత క్రూరంగా నిర్బంధ విధానం అమలు జరుపుతూవచ్చారు. అనేకసార్లు వారు ట్రేడ్‌యూనియన్ నాయకుల్ని అరెస్టు చేశారు. కొత్తగా యేర్పడే సంఘాలను నిషేధించడానికి అవకాశమిచ్చే విధంగా రిజిస్ట్రేషన్ నిబంధనలు అమలు జరపబడ్డాయి. ఇన్ని జరిగినా, ట్రేడ్‌యూనియన్ ఉద్యమం అణచబడలేదు. గత సంవత్సరం మలయాలో జరిగిన ఎక్కువ సమ్మెలు 1947 తర్వాత ఎన్నడూ జరగలేదు. ప్రభుత్వ లెక్కల ప్రకారం ఆయేటు 213 సమ్మెలు జరిగాయి.

సింహళంలో 1956 లో జరిగిన సాధారణ ఎన్నికల్లో ప్రజాస్వామ్యశక్తులు బ్రహ్మాండమైన విజయం సాధించాయి. తత్ఫలితంగా, ట్రేడ్‌యూనియన్ ఉద్యమానికి అదివరకులేని కొన్ని అనుకూలపరిస్థితులు లేర్పడ్డాయి. నౌకాస్థావరాలను బ్రిటన్ నుంచి తిరిగి వశపరచుకోడానికి, విదేశీపరిశ్రమలను జాతీయం చేయడానికి కొత్తప్రభుత్వం ప్రారంభించిన కృషిని ట్రేడ్‌యూనియన్ ఉద్యమం బలపరిచింది. ఐక్యకార్యాచరణకూడా వృద్ధిచెందింది. సింహళ ట్రేడ్‌యూనియన్ ఫెడరేషన్, డెమాక్రటిక్ ట్రేడ్‌యూనియన్ కాంగ్రెసు, తదితర ట్రేడ్‌యూనియన్ సమాఖ్యలు సంయుక్తంగా బ్రిటిష్ తేయాకుతోటల్లోను, బ్రిటిష్ ఇంజనీరింగ్ కంపెనీలలోను పనిచేసే కార్మికుల సమ్మెను నడిపాయి. ఆనాడు అమలోఉన్న ట్రేడ్‌యూనియన్‌చట్టాన్ని సవరించమని కోరుతూ అన్ని ప్రధాన ట్రేడ్‌యూనియన్ సమాఖ్యలు ప్రభుత్వానికి సంయుక్తంగా మెమొరాండం పంపించాయి. సింహళ ట్రేడ్‌యూనియన్ ఫెడరేషన్ ట్రేడ్‌యూనియన్లమధ్య ఐక్యత సాధించడానికి 15 అంశాలతో కూడిన ఒక కార్యక్రమాన్ని తయారుచేసింది.

ఫిలిప్పీన్స్ కార్మికులు అమెరికా పెత్తనంపట్ల అంతకంతకు అధికంగా అసంతృప్తి చెందుతున్నారు. గువాన్, వేక్, సమోవా అనే దీవులలో పనిచేసే ఫిలిప్పీన్స్ కార్మికులకు కనీస వేతనాలచట్టం వర్తించదంటూ లోగడ అమెరికా శాసనసభ ఒక తీర్మానంచేసింది. ఈ విచక్షణాయుత చర్యను 1956 లో ఫిలిప్పీన్స్ ట్రేడ్‌యూనియన్ కౌన్సిలు తీవ్రంగా ఖండించింది. ఈయేడు (1957) జూన్ మాసాంతంలో మూడు అమెరికన్ బస్ కంపెనీలలో పనిచేసే కార్మికులు అక్రమంగా డిస్మిసు చేయబడ్డ ట్రేడ్‌యూనియన్ కార్యకర్తల్నీ సభ్యుల్నీ తిరిగి పనుల్లోకి తీసుకోవాలనే నినాదంతో సమ్మె చేశారు. కార్మికులమీద యజమానులు విధించే క్రమ జుల్మానాల పద్ధతినికూడ వారు నిరసించారు. ఫిలిప్పీన్స్‌లో అన్నిటికన్న పెద్ద ట్రాన్స్‌పోర్టు కార్మికుల సమ్మె యిదే. దాన్ని అణచేందుకు అమెరికన్ పెట్టుబడిదార్లు సైనికుల్ని సైతం ఉపయోగించడానికి వెనుకాడలేదు. ఆ విధానాన్ని ట్రేడ్‌యూనియన్ నాయకులు తీవ్రంగా నిరసించారు. అమెరికన్ పెట్టుబడిదారు ఫిలిప్పీన్స్ కార్మిక చట్టాలను పాటించనైనా పాటించాలి; లేదా "మూట ముల్లెకట్టుకొని వెళ్ళిపోనైనా వెళ్ళిపోవాలి" అని ట్రేడ్‌యూనియన్ నాయకులు హెచ్చరించారు.

థాయ్‌లాండ్‌లో కూడా ట్రేడ్‌యూనియన్లు జాతీయ స్వాతంత్ర్యారక్షణకు జరిగిన పోరాటంలో పాల్గొన్నాయి. థాయ్‌లాండ్ ప్రభుత్వం అమెరికన్ సామ్రాజ్యవాదుల పెత్తనంనుంచి బయటపడాలనీ, ఆగ్నేయాసియా సైనిక కూటమినుండి తప్పుకోవాలనీ, ప్రపంచశాంతికి దోహదమిచ్చే విధంగా తటస్థ విధాన మవలంబించాలనీ ప్రజలకు సంపూర్ణ స్వేచ్ఛ ప్రజాస్వామ్య హక్కులు లభించేటట్లు చూడాలనీ ట్రేడ్‌యూనియన్లు డిమాండు చేశాయి. ఈయేడు మే దినోత్సవ సందర్భంలో ట్రేడ్‌యూనియన్ ఉద్యమం అన్నిరకాలైన ఆటంకాలను అధిగమించి, అఖిలచైనా ట్రేడ్‌యూనియన్ సమాఖ్య పంపిన ఆహ్వానాన్ని అందుకొని,

మొట్టమొదటిసారి పెకింగ్ మహాసభలో పాల్గొనేందుకు కార్మిక ప్రతినిధి వర్గాన్ని పంపింది. ఆగస్టు మాసంలో అటం, హైడ్రోజన్ బాంబుల నిషేధాన్ని కోరేందుకు టోకియోలో జరిగిన మహాసభకు మరో ప్రతినిధవర్గం వెళ్ళింది.

దక్షిణకొరియా, దక్షిణవియత్నాంలలో 1953 తర్వాత అభివృద్ధివిరోధక ప్రభుత్వాలు పెట్టే క్రూరహింసలన్నిటినీ ఎదు ర్కొంటూ కార్మికోద్యమం పురోగమించింది. అసమగ్రమైన లెక్కల ప్రకారం 1952 ఉత్తరార్ధభాగంలో దక్షిణకొరియాలో 15 కార్మిక పోరాటాలు జరిగాయి; 1954 లో 44. 1955 లో 55, 1956 లో 96 పోరాటాలు జరిగాయి. 10,000 మంది దక్షిణ కొరియన్ రేవు పనివారు తమ వేతనాలను 100 కి 65 చొప్పున పెంచమని అమెరి కన్ సైనికాధికారుల్ని కోరుతూ 15 నెలలు వరుసగా పోరాటం జరిపారు. దక్షిణ వియత్నాంలోకూడ కార్మికులు తమ స్థితిగతు లను బాగుపరచుకొనేందుకు నిర్విరామంగా సమ్మెలు చేశారు. ఉదాహరణకు 1956 లో జరిగిన 6 సమ్మెల్లో 27,000 మంది కార్మికులు పాల్గొన్నారు. 1956 జనవరిలో దక్షిణ వియత్నాం కార్మిక లోక సంయుక్త సమావేశాన్ని ఏర్పాటు చేశారు. దానికి 174 పరిశ్రమలనుంచి 300 మంది ప్రతినిధులు హాజరయారు. ఇలాగే అనేక శాఖలలో కార్మికుల మహాసభలు జరిగాయి. వాటిలో 25,000 మంది తరపున ప్రతినిధులు హాజరయారు. ఈ మహాసభ లన్నిటిలోను ప్రపంచ శాంతిని, దేశ ఐక్యతను, స్వేచ్ఛా ప్రజా స్వామ్యాలను, కార్మికుల హక్కులను కోరుతూ తీర్మానాలు చేయబడ్డాయి. ఈయేడు మే దినోత్సవంనాడు సుమారు 2,00,000 ప్రజలు సైగాన్ నగరవీధుల్లో ప్రదర్శనలు జరిపారు. ప్రభుత్వ మెన్ని నిర్బంధాలు విధించినా లెక్కచేయక వారు "మాతృదేశ సమైక్యతకు, అమెరికన్ సామ్రాజ్యవాదుల దురాక్రమణను నిరోధించేందుకు" ముందుకు సాగుదాం — అంటూ నినాదాలు చేశారు.

జాతీయ స్వాతంత్ర్య సమస్యపై జపాన్ ప్రజలకు, ఆసియా-ఆఫ్రికాలలో యితర దేశాల ప్రజలకుమధ్య కొన్ని ఉమ్మడి సమస్య లున్నాయి.

జపాన్ ట్రేడ్‌యూనియన్లు అమెరికన్ సైనికస్థావరాలకు వ్యతిరేకంగా దృఢనిశ్చయంతో పోరాటాలు నడిపాయి. సునగావా ప్రజలు అమెరికన్ విమానాశ్రయ విస్తరణను వ్యతిరేకిస్తూ వీరోచితంగా పోరాడుతున్న సమయంలో అఖిలజపాన్ ట్రేడ్‌యూనియన్ సమాఖ్య ఆ పోరాటాన్ని బలపరుస్తూ కార్మికుల్నీ, విద్యార్థుల్నీ సమీకరించింది. అమెరికన్ సైనికస్థావరాల్లో పనిచేసే కార్మికులు అమెరికన్ అధికారులచే పీడింపబడుతున్నారు. దానికి వ్యతిరేకంగా కార్మికులు పోరాడుతున్నారు.

ఒకినావీవిని తిరిగి స్వాధీనంచేయాలి; నాకాసక మోటో అను జపాన్‌స్త్రీని తుపాకితో కాల్చిచంపిన అమెరికన్ సైనికుని శిక్షించాలి; జపాన్‌పై అమెరికా బలవంతంగా రుద్దిన ఒడంబడికలను రద్దుచేయాలి — అనే నినాదాలతో జపాన్ ప్రజలు సాగిస్తున్న బ్రహ్మాండమైన ఆందోళనలో కార్మికసంస్థలు చురుగ్గా పాల్గొంటున్నాయి.

## మధ్యప్రాచ్య, సమీపప్రాచ్య దేశాలు

మధ్యప్రాచ్యంలోను, సమీపప్రాచ్యంలోను అరబ్బుదేశాల ట్రేడ్‌యూనియన్లు గత కొద్దిసంవత్సరాలుగా జాతీయ స్వాతంత్ర్య రక్షణకోసం జరుగుతున్న పోరాటంలో చురుగ్గా పాల్గొంటున్నాయి. ఈ విధంగా వాస్తవ పరిస్థితి స్పష్టంగా కనిపిస్తూంది.

1955 లో మధ్యప్రాచ్య దేశాలమీద అమెరికా బలవంతంగా బాగ్దాద్ ఒడంబడికను రుద్దప్రయత్నించినప్పుడు ఆ దేశాల కష్టజీవులు చాల తీవ్రంగా వ్యతిరేకించారు; సుడాన్, జోర్డాన్, లెబనాన్, సిరియా మొదలైన దేశాల్లోను, చాల చిక్కుల్లోఉన్న

ఇరాక్, ఇరాన్, ఏడెన్‌లలోను కార్మికులు అనేక నిరసన సమ్మెలు, ప్రదర్శనలు జరిపారు.

సూయెజ్ కాలువపై తనకున్న హక్కును పునరుద్ధరించు కోడానికి బ్రిటన్—ఫ్రాన్స్—ఇజ్రాయెల్ దేశాల దురాక్రమణను ప్రతిఘటించడానికి ఈజిప్ట్ వీరోచితంగా పోరాడుతూన్నప్పుడు కార్మిక ప్రజలు నిరుపమానమైన ధైర్యాన్ని ప్రదర్శించారు. ఈ పోరాటంలో అరబ్బుదేశాల కార్మికులు, ప్రజలు అత్యున్నతమైన ఐక్యతను ప్రదర్శించారు. ఈ దేశాలన్నిటిలోను చాల పెద్దయెత్తున సమ్మెలు, ప్రదర్శనలు జరిగాయి. సుడాన్ ట్రేడ్‌యూనియన్ ఫెడరేషన్ ఈజిప్ట్‌కు వెళ్ళదలచుకున్న అనేకమంది వాలంటీర్లను సమీకరించి, ఈజిప్ట్ ప్రభుత్వం బ్రిటన్ - ఫ్రాన్స్‌లతో రాజకీయ సంబంధాలను తెగత్రెంచుకోవాలని డిమాండు చేసింది. జోర్డాన్, సిరియాలలో బ్రిటిష్, ఫ్రెంచి నూనెకంపెనీల పైప్ లైన్స్‌ను కార్మికులు తెగగొట్టివేశారు. 1956 ప్రారంభంలో స్థాపింపబడిన అరబ్బు ట్రేడ్‌యూనియన్ల ఇంటర్‌నేషనల్ కాన్ఫెడరేషన్ పెద్ద యెత్తున అరబ్బు కార్మికుల్ని సమీకరించి పోరాటంలో పాల్గొనే టట్లు చేసింది. గత మే మాసంలో అరబ్బు ఫెడరేషన్‌యొక్క కార్యనిర్వాహకవర్గం ఐసెన్‌హోవర్ సిద్ధాంతాన్నీ, అరబ్బు దేశాలపై దాడి చేసేందుకు సామ్రాజ్యవాదులు జరిపే యితర కుట్రల్నీ గర్హిస్తూ తీర్మానించింది.

ఈజిప్ట్‌పై దురాక్రమణకు వ్యతిరేకంగా జరిగిన యుద్ధం విజయవంతమైన తర్వాత యీ ప్రాంతంలో ట్రేడ్‌యూనియన్లు మధ్యప్రాచ్య, సమీప ప్రాచ్య దేశాల ప్రజల్ని బానిసత్వంలో బంధించేందుకు ఉద్దేశింపబడిన ఐసెన్‌హోవర్ సిద్ధాంతంపైనే తమ దృష్టిని ప్రధానంగా కేంద్రీకరించి పోరాటం ప్రారంభించాయి. జోర్డాన్‌లో అమెరికన్ సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా కష్టజీవులైన ప్రజాసామాన్యం సమ్మెలు, ప్రదర్శనలు జరిపారు. తర్వాత, అమెరికన్ సామ్రాజ్యవాదులు చేసిన కుట్రలఫలితంగా ప్రజా

అతి క్రూరమైన నిర్బంధవిధానానికి లోనయింది. జోర్డాన్ యూనియన్ సమాఖ్య రద్దుచేయబడింది. అయినా, ఐసెన్ హోవర్ సిద్ధాంతానికీ, అమెరికన్ ఆధిపత్యానికి వ్యతిరేకంగా ఉద్యమం కొనసాగుతూనే వచ్చింది.

మరొక ఉదాహరణ ఏమంటే : సుడాన్ ట్రేడ్‌యూనియన్ ఫెడరేషన్ ఐసెన్‌హోవర్ సిద్ధాంతం వెనుకనున్న కుట్రను బహిర్గత మొనరిస్తూ వరుసగా అనేక ప్రత్యక్షచర్యలకు పూనుకొంది; "అమెరికా సహాయం" జాతీయ స్వాతంత్ర్యానికి, ట్రేడ్ యూనియన్ ఉద్యమానికి, ప్రజల జీవన ప్రమాణాలకూ ఏవిధంగా ముప్పుతెచ్చిపెడుతుందో కార్మికులకు వివరించిచెప్పింది. ప్రధాన నగరాలన్నింటిలోను అది ప్రజానీకాన్ని సమీకరించి, సుడాన్ ప్రభుత్వం తటస్థవిధాన మనుసరించాలనీ, ఐసెన్‌హోవర్ సిద్ధాంతాన్ని తిరస్కరించాలనీ కోరుతూ తీర్మానాలు చేసింది. నిక్సన్ రాకను ఖండిస్తూ సుడాన్ అంతటా పెద్ద ఉద్యమాన్ని ప్రారంభించింది.

సుడాన్ ట్రేడ్‌యూనియన్ ఉద్యమం వలస విధానానికి వ్యతిరేకంగా జాతీయ స్వాతంత్ర్యంకోసం పోరాడ్డంవల్ల దాని సభ్యత్వం యిదివరకటికంటె బాగా పెరిగింది. స్వాతంత్ర్యం తర్వాత ట్రేడ్‌యూనియన్లయెడ జాతీయ పెట్టుబడిదారీ ప్రభుత్వపు వైఖరి అధ్వాన్నంగా తయారైనప్పటికీ, సుడాన్ ట్రేడ్‌యూనియన్ ఫెడరేషన్ జాతీయ స్వాతంత్ర్యాన్ని పటిష్ఠమొనర్చే విధానాన్ని, ట్రేడ్‌యూనియన్ ఉద్యమాన్ని ఐక్యపరచే విధానాన్ని, కష్టజీవుల కోర్కెలను ప్రభుత్వం సంతృప్తిపరచేటట్లుచేసే విధానాన్ని పట్టుదలగా కొనసాగిస్తోంది. లోగడ సుడాన్ ట్రేడ్‌యూనియన్ ఫెడరేషన్‌లో చీలిక యేర్పడ్డంవల్ల కొంతకాలం కార్మికోద్యమంలో ఐక్యత చెడింది. కాని ఆ పరిస్థితి యీ రోజునలేదు; తిరిగి కార్మికోద్యమంలో ఐక్యత ఏర్పడింది.

సిరియాలో ట్రేడ్‌యూనియన్ ఉద్యమం సిరియా యూనియన్ సమాఖ్యలో ఐక్యమైంది. 1955 లో జరిగి సిరియన్ ట్రేడ్‌యూనియన్ మహాసభ కార్మికుల ఐక్యత వ్యక్తంచేసింది. ప్రస్తుతం ఆ దేశంలో కార్మికవర్గం, ట్రేడ యన్ ఉద్యమం అమెరికన్ సామ్రాజ్యవాదుల సాయుధ కుట్రలకు వ్యతిరేకంగా జాతీయ స్వాతంత్ర్యంకొరకు పోరాడుతున్నాయి. అనేక అరబ్బుదేశాల, తదితరదేశాల కార్మికులు తమ సిరియన్ సోదరుల పోరాటాన్ని బలపరుస్తున్నారు. సిరియన్ ప్రజల పోరాటాన్ని ప్రపంచ కార్మికులు దృఢ నిశ్చయంతో బలపరచగలరనీ, యిందుకై ప్రపంచ ట్రేడ్‌యూనియన్ మహాసభ తగు పూనికతో పనిచేయగలదనీ మనం ఆశించవచ్చు ననుకుంటా.

సౌదీఅరేబియా, సిరియా, ఇరాక్, ఇరాన్, లెబనాన్, కువాయట్, బహరీన్ మొదలైన దేశాలలో కార్మికులు తమ స్థితిగతులను బాగుపరచుకోడానికీ, నిరుద్యోగాన్ని నిర్మూలించేందుకూ, ట్రేడ్‌యూనియన్ హక్కులరక్షణకూ కూడ పోరాడుతున్నారు. వారి పోరాటం ప్రప్రథమంగా విదేశీ పెట్రోల్ గుత్తపెట్టుబడిదార్లమీద కేంద్రీకరింపబడింది. ఉదాహరణకు సౌదీ అరేబియాలో 14,000 మంది కార్మికులు ప్రజలందరి సహకారంతో అరమేమ్ అను అమెరికన్ పెట్రోలుకంపెనీ యజమానులమీద పోరాటం జరిపి విజయం సాధించారు. సిరియాలో 5,000 మంది అలెప్‌కంపెనీ కార్మికులు జీతాల పెంపుదలకై ఆందోళన చేశారు; ఆ పోరాటాన్ని యితర పరిశ్రమలకు చెందిన 15,000 మంది కార్మికులు బలపరిచారు; చివరకు పోరాటం ఫలించింది. ఈ యేడు జూన్‌మాసంలో ఇరాన్‌లోని అగడ్‌జారీ నూనెగనుల కార్మికులు 12,000 మంది సమ్మెచేశారు. నూనెగనులను జాతీయమొనర్చాలన్న నినాదం యీ ప్రాంతపు అనేకదేశాల కార్మికుల్లో, ప్రజాసామాన్యంలో మారుమ్రోగుతోంది. మరో ముఖ్యమైన

కు, ఒహరాన్‌లో 60 000 మంది పెంకుకార్మికులు జీతాల
క్కై జరిపిన సమ్మె జయప్రద మవడం.

సైప్రెస్ కార్మికులు స్వయంనిర్ణయ హక్కు-కొరకు, సామ్రాజ్య
...ంకు వ్యతిరేకంగాను బ్రిటిష్ పాలకులపై సాగించిన వీరోచిత
పోరాటాన్ని యీ సందర్భంలో పేర్కొనవలసియుంది. ఈ పోరా
టంలో అన్ని దృక్పథాల ట్రేడ్‌యూనియన్ నాయకులు అరెస్టు
చేయబడ్డారు. అయినా, సైప్రెస్‌లో ట్రేడ్‌యూనియనులు తమ
కార్యకలాపాలను కొనసాగిస్తూనే ఉన్నాయి. వాటిమధ్య ఐక్య
కార్యాచరణ వృద్ధిచెందుతూంది. విభిన్న దృక్పథాలకుచెందిన
11 ట్రేడ్‌యూనియన్ సంస్థలు 1956 జూన్‌లో సాంఘిక భద్రతను
గురించి ప్రభుత్వానికి కొన్ని సూచనలతో ఒక మెమోరాండం
సమర్పించాయి. బ్రిటిష్ పెత్తనాన్ని అంతమొనర్చాలనీ, అరెస్టు
చేయబడిన వారందరినీ విడుదలచేయాలనీ, తమ స్థితిగతులను
బాగుపరచాలనీ కోరుతూ సైప్రెస్ కార్మికులు ఐక్యతతో అనేక
సార్లు సమ్మెలు జరిపిన ఫలితంగా, బ్రిటిష్ ప్రభుత్వం 33వ అత్యవ
సర ఉత్తర్వును రద్దుచేయవలసివచ్చింది; దేశభక్తుడైన ఆర్చిబిషప్
మెకారియోస్‌ని విడుదలచేయవలసి వచ్చింది; సైప్రెస్ ఫెడరేషన్
ఆఫ్ లేబర్ ప్రధాన కార్యదర్శి జియార్టిడ్ పైన, యితర ట్రేడ్
యూనియన్ నాయకులపైన, రాజకీయపార్టీల నాయకులపైన అరెస్టు
వారంట్లను ఉపసంహరించుకోవలసి వచ్చింది.

## ఆ ఫ్రి కా దే శా లు

ఉత్తర ఆఫ్రికాలోను, నీగ్రో ఆఫ్రికాలోను గత కొద్ది
సంవత్సరాల్లో జాతీయ స్వాతంత్ర్యంకొరకు ప్రజలు అంతకంతకు
ఎక్కువ వీరోచితంగా పోరాడుతూ వచ్చారు. ఈ పోరాటాల్లో
ట్రేడ్‌యూనియన్ ఐక్యత ఎంతో అభివృద్ధి చెందింది.

ట్యునీషియాలో ట్రేడ్‌యూనియన్ ఉద్యమం అనేక సంవత్స
రాలు విభజింపబడియుంది. 1954-'55 లో జరిగిన ఐక్య పోరాటాల

ప్రాతిపదికపై తిరిగి ఐక్యత సాధింపబడింది. ఈ సందర్భంలో యు. ఎస్. టి. టి. సోదరుల్ని అభినందించవలసియుంది. 1956 ప్రారంభంలో ట్రేడ్‌యూనియన్ ఐక్యతకై చర్యలు తీసుకున్నారు.

మొరాకోలో స్వాతంత్ర్యం తర్వాత ట్రేడ్‌యూనియ ఉద్యమం బాగా పురోగమించింది. ఈ రోజున యునైటె మొరాకో ట్రేడ్‌యూనియన్ సమాఖ్య ఆ దేశంయొక్క ఆర్థిక రాజకీయ వ్యవహారాల్లో ప్రముఖపాత్ర వహిస్తోంది.

ఆల్జీరియాలో ఫ్రెంచి సామ్రాజ్యవాదులు సాగిస్తున్న వలసయుద్ధం మూలంగా ట్రేడ్‌యూనియన్‌సంస్థల కార్యకలాపాలు యించుమించు అసాధ్యమయ్యాయి. ట్రేడ్‌యూనియన్ నాయకుల అరెస్టులు, జైలునిర్బంధాలు, హత్యలు కనీ విని యెరుగని స్థాయికి చేరుకున్నాయి. అన్ని ట్రేడ్‌యూనియన్లూ బహిరంగంగా పనిచేయడం సాధ్యంకాకపోయినప్పటికీ ఈయేడు జనవరి, జూలై మాసాల్లో జరిగిన రాజకయ సమ్మెలనుబట్టి కార్మికులందరూ వలస విధానానికి వ్యతిరేకంగా జాతీయ స్వాతంత్ర్యంకొరకు పోరాడ్డానికి దృఢసంకల్పులయారని స్పష్టమవుతుంది. ఇందుకై ఆల్జీరియాలోని ట్రేడ్‌యూనియన్లన్నీ సమిష్టిగా కృషిచేయగలవనీ, స్వాతంత్ర్య సంపాదనకు ఐక్యత ఎంతఅవసరమో అవి గుర్తించగలవనీ ఆశిద్దాం.

నీగ్రో ఆఫ్రికాలోని ట్రేడ్‌యూనియన్లు ఈయేడు జనవరి మాసంలో కొటోనో మహాసభ జరుపుకొని యు. జి. టి. ఎ. న్. అను సంస్థను స్థాపించుకున్నారు. అందులో పశ్చిమఆఫ్రికా దేశాలకు జెందిన విభిన్న దృక్పథాల కేంద్ర ట్రేడ్‌యూనియన్ సంస్థలు, స్వతంత్ర కార్మిక సంఘాలు అనుబంధ సంస్థలుగా చేరి, ఐక్యతతో పనిచేస్తున్నాయి. పై సంస్థయొక్క ఉద్దేశాలు ఆఫ్రికన్ కార్మికు లందరిమధ్య నిర్మాణ ఐక్యత సాధించడం; వలస విధానానికి, మానవుని మానవుడు దోచుకొనే యితర పద్ధతులకూ వ్యతిరేకంగా పోరాడ్డం; కార్మికుల ఆర్థిక—సాంఘిక కోర్కెలను సాధించేందుకు,

ఆఫ్రికన్ కార్మికుల విశిష్టహోదాను కాపాడేందుకు, ఆఫ్రికన్ ప్రజల జన్మహక్కైన సంపూర్ణ స్వాతంత్ర్యాన్ని సంపాదించేందుకు కృషి సల్పడం. ఆగస్టుమాసంలో యు. జి. టి. ఎ. ఎస్. సంస్థ అక్రమ మైన వేతన నిర్ణాయక పద్ధతికి వ్యతిరేకంగా డాకార్‌లో సాధారణ సమ్మెకు పిలుపు యిచ్చింది. ఫ్రెంచి ఈక్వెటోరియల్ ఆఫ్రికాలో కూడ ట్రేడ్‌యూనియన్ ఉద్యమం ఐక్యతకోసం తీవ్రంగా కృషి చేస్తూంది. నీగ్రో ఆఫ్రికాలో ట్రేడ్‌యూనియన్ ఐక్యత మరింత పటిష్ఠంగా అభివృద్ధిచెందవచ్చు.

కొత్తగా స్వాతంత్ర్యం పొందిన ఘనాలో ట్రేడ్‌యూని యన్‌లు స్వాతంత్ర్య పోరాటంలో ప్రముఖ పాత్ర వహించిన విషయం అందకీ తెలుసు; అంతేగాక, గత కొద్ది సంవత్సరాల్లో కార్మిక పోరాటాలు ఉచ్ఛస్థాయికి వెళ్ళాయి. ఉదాహరణకు 35,000 మంది గని కార్మికులు విదేశగుత్తాధిపతులకు వ్యతిరేకంగా 3 మాసాలు సమ్మె పోరాటం జరిపారు. మొట్టమొదటిసారిగా ఉపాధ్యాయులు సమ్మెచేశారు. పోస్టల్ పనివారు సమ్మెచేశారు. అయినప్పటికీ, ఈ దేశంలో ట్రేడ్‌యూనియన్ ఉద్యమం దురదృష్ట వశాత్తు చీలిపోయి ఉంది. ప్రస్తుతం ఘనా స్వాతంత్ర రాజ్యంగా అవతరించింది గనుక ట్రేడ్‌యూనియన్ కాంగ్రెసు, స్వతంత్ర ట్రేడ్‌యూనియన్ సంస్థ జాతీయ స్వాతంత్ర్యాన్ని పటిష్ఠ మొనర్చేటందుకు, జాతీయార్థిక వ్యవస్థను అభివృద్ధి చేసేటందుకు, కార్మికుల స్థితిగతులను బాగుపరచేటందుకు భుజం భుజం కలిపి పని చేస్తాయని ఆశిద్దాం.

బ్రిటిష్ ఆధిపత్యంక్రిందఉన్న ఆఫ్రికాలో 1955–'56 సంవత్స రాల్లో పెద్దయెత్తున జరిగిన సమ్మెలు ఆఫ్రికాచరిత్రలోనే అసామాన్య మైనవి. ఉదాహరణకు ఉత్తరరొడేషియాలో 40,000 మంది రాగి గని కార్మికులు 58 రోజులు సమ్మెచేశారు. నైజీరియాలో 40,000 మంది తగరపుగని కార్మికులు, 40 000 మంది గృహ నిర్మాణకార్మికులు సమ్మెచేశారు. కీన్యాలో రేవు కార్మికులు,

ఉగాండాలో 10,000 మంది చెరకుతోట కార్మికులు సమ్మెచేశారు. దక్షిణాఫ్రికాలో ఇండస్ట్రియల్ కన్సీలియేషన్ సవరణ చట్టానికి వ్యతిరేకంగాను, రోజుకు కనీస వేతనం 1 పౌను ఉండాలనే నినాదంతోను బ్రహ్మాండమైన పోరాటం ఒకటి అభివృద్ధి చెందుతోంది. బస్సు రేట్లు హెచ్చింపబడినందుకు నిరసనగా 1,00,000 మంది ఆఫ్రికన్ ప్రజలు మున్సిపల్ బస్సులన్నిటినీ 3 మాసాలు బహిష్కరించారు. ఈ ఉద్యమంలో ఆఫ్రికన్ కార్మికులు చాల ప్రధానమైన పాత్ర నిర్వహించారు. చివరకు పోరాటం ఫలించింది. దక్షిణాఫ్రికాలో వృద్ధిచెందే ప్రతిఘటనోద్యమానికి ఇది చక్కని ఉదాహరణ. జీతాల హెచ్చింపుకొరకు జరిగిన సమ్మెలన్నిటివల్ల వలసవిధానం క్రింద జీతాలవ్యవస్థ ఎంత అధ్వాన్నంగా ఉన్నదో స్పష్టమవుతుంది. ఉదాహరణకు ఉత్తరరొడేషియా రాగిగని కార్మికులు తమ జీతాలను 100 కి 300 వంతున పెంచాలని డిమాండుచేశారు. నైజీరియన్ కార్మికులు తమ జీతాలను 100 కి 100 నుంచి 200 వరకు హెచ్చించుకోగలిగారు. ఈ ఘటనలన్నీ జనసామాన్యంయొక్క నూతన జాగృతిని తెలియజేస్తాయి. వారు తమ స్థితిగతులలో పూర్తి మార్పును కోరుతున్నారు.

ఈ పోరాటాల్లో ట్రేడ్ యూనియన్ ఐక్యతకూడా పెంపొందింది. ఉదాహరణకు ఉత్తర రొడేషియాలో మూడు ప్రధాన ట్రేడ్ యూనియన్ సంస్థలు (గనికార్మికులవి, రైల్వేకార్మికులది, గృహనిర్మాణ కార్మికులది) ఆఫ్రికన్ ట్రేడ్ యూనియన్ కాంగ్రెసులో ఐక్యమయాయి. నైజీరియాలో తిరిగి ట్రేడ్ యూనియన్ ఐక్యత నెలకొంది. తత్ఫలితంగా అఖిల నైజీరియన్ ట్రేడ్ యూనియన్ ఫెడరేషన్ స్థాపింపబడింది. న్యాసాలాండ్, టంగనియాకా, ఉగాండాలలో ఈ మధ్యనే ఒక ట్రేడ్ యూనియన్ సమాఖ్య నిర్మింపబడింది. కీన్యా ట్రేడ్ యూనియన్ ఫెడరేషన్ వలస రాజ్యాధిపత్యాన్ని ధైర్యంతో ఎదుర్కొంది. దాని నాయకులు

రాజకీయ కార్యకలాపాల్లో చురుగ్గా పాల్గొన్నారు. సాధారణ ఎన్నికల్లో కొన్ని విజయాలు సాధించారు.

ఈ ట్రేడ్‌యూనియన్ ఉద్యమ నెల్లువ సామ్రాజ్యవాదుల్ని హడలెత్తించింది. ప్రతిచోట చీలికలు తేవడానికి వారు ప్రయత్నించారు. రెండోవైపున నిర్బంధ చర్యలకు దిగారు. ఈమధ్యనే ఐక్యతను సాధించుకున్న అఖిల నైజీరియన్ ట్రేడ్‌యూనియన్ ఫెడరేషన్ మళ్ళీ చీలిపోయింది. ఉత్తర రొడీషియాలో ట్రేడ్ యూనియన్లు అమానుషమైన నిర్బంధ విధానానికి లోనయాయి. దక్షిణాఫ్రికాలో ట్రేడ్‌యూనియన్ ఉద్యమం జాతివిచక్షణ విధానాన్ననుసరించి రెండుగా విభజింపబడింది. అన్ని జాతుల కార్మికులకు ప్రాతినిధ్యం వహించే దక్షిణాఫ్రికా ట్రేడ్‌యూనియన్ కాంగ్రెసును అణచేటందుకు అక్కడి ప్రభుత్వం అన్నివిధాల ప్రయత్నిస్తోంది.

ట్రేడ్‌యూనియన్ ఉద్యమాన్ని అణచేటందుకు, విభజించేటందుకు వలస రాజ్యాధిపతులెన్ని చేసినప్పటికీ నైజీరియా, ఉత్తర రొడేషియా, దక్షిణాఫ్రికాల కార్మికులు ట్రేడ్‌యూనియన్ హక్కులకొరకు, తమ ప్రయోజనాలను కాపాడుకోడానికి, ట్రేడ్ యూనియన్ ఐక్యతనునిర్మించడానికి, జాతీయ స్వాతంత్ర్యం సాధించడానికి నిర్విరామంగా, పట్టుదలతో పోరాడుతున్నారు.

బెల్జియన్ కాంగోలోకూడ మనం నవజాగృతిని చూడవచ్చు. కాంగో కార్మికులు ట్రేడ్‌యూనియన్లను స్థాపించుకోడానికి బెల్జియన్ ప్రభుత్వం అనుమతించవలసివచ్చింది. అప్పుడే కాంగోలో అఖిల కాంగో ట్రేడ్‌యూనియన్ సంస్థ ఏర్పడింది.

## లాటిన్ అమెరికా దేశాలు

అమెరికా యీ మధ్య లాటిన్ అమెరికా దేశాల ఆర్థిక రాజకీయ వ్యవహారాల్లో తన ప్రాబల్యాన్ని అధికంచేయడంవల్ల యీ దేశాలన్నిటిలోను నోట్లముమ్మరం ఒక సామాన్య లక్షణంగా

తయారైంది. ప్రజాస్వామ్య హక్కులు, ట్రేడ్‌యూనియన్ అధికారాలు తరచు సంకుచితం జేయబడుతున్నాయి. అందుచేత యీ దేశాల్లో ట్రేడ్‌యూనియన్ ఉద్యమంయొక్క ప్రధాన లక్షణం జాతీయ స్వాతంత్ర్యాన్నీ, సహజ సంపదలన్నీ కాపాడేందుకు, జీవన ప్రమాణాన్ని తగ్గించడానికి జరిగే ప్రయత్నాలను వ్యతిరేకించేందుకు, ట్రేడ్‌యూనియన్ హక్కులను కాపాడేందుకు —అతి విస్తృతమైన పోరాటాన్ని అభివృద్ధిచేయడం.

చిలియన్ కార్మికులు 1953 తర్వాత సి. యు. టి. సిహెచ్. అను సంస్థలో సంఘటితులై, అమెరికాకు దాసోహంచేసే ప్రభుత్వ విధానాలకు వ్యతిరేకంగా ఐక్యతతో అనేక పోరాటాలు జరిపారు; ఎన్నో విజయాలు సాధించారు. ఉదా: 1954 మే మాసంలో 7,00,000 మందికార్మికులుజరిపినసార్వజనీనసమ్మె; 1955 జూలై 7న 13,00,000 మంది కార్మికులు, 1956 జనవరి 9న 10,00,000 మంది కార్మికులు జరిపిన సార్వజనీన సమ్మెలు; నైట్రేట్ గనికార్మికులు, రాగిగని కార్మికులు, రేవుకార్మికులు, బ్యాంకు ఉద్యోగులు సాగించిన సమ్మెలు. 1956 ప్రారంభంలో జరిగిన సాధారణ సమ్మెలో సి. యు. టి. సిహెచ్. అమానుషమైన నిర్బంధ విధానానికి లోనైనప్పటికీ, అగ్రనాయకుల్లో చాలమంది అరెస్టు చేయబడినప్పటికీ, ఆ సంస్థను చీల్చడానికి జరిగిన ప్రయత్నాలన్నీ భగ్నం చేయబడ్డాయి; ఐక్యత కాపాడబడింది. అరెస్టు చేయబడిన నాయకులు విడుదలచేయబడ్డారు. 1957 జనవరిలో కార్మికుల వేతనాలను ప్రభుత్వం 100 కి 30 చొప్పున హెచ్చించేటట్లు చేసుకోగలిగారు. ఆగస్టు 15 - 18 తేదీలలో సి. యు. టి. సి. హెచ్. మొట్టమొదటి మహాసభ జరుపుకొంది. చిలియన్ కార్మికుల్ని ఐక్యపరచడంలో, ట్రేడ్‌యూనియన్ ఐక్యతను పటిష్ఠ మొనర్చడంలో ఆ మహాసభ ఎంతో సహాయం చేసింది. గత నాలుగు సంవత్సరాల్లో చిలియన్ కార్మికులు సంపాదించిన అనుభవాన్నంతటినీ మహాసభ ఎంతో చక్కగా క్రోడీకరించింది. చిలియన్ కార్మికులీనాడు కొత్త పోరా

టాలు జరపడానికి, యింతవరకు సంపాదించిన ఐక్యతను పటిష్ఠ మొనర్చడానికి ప్రయత్నిస్తున్నారు.

జాతీయ స్వాతంత్ర్యాన్ని రక్షించేందుకు జరిగే పోరాటంలో సి. యు. టి. సిహెచ్. అమెరికాతో సైనికసంధి చేసుకోరాదనీ, దేశంయొక్క సహజ సంపదను అమెరికా గుత్తాధిపత్య సంస్థలు కొల్లగొట్టుకోకుండా చూడాలనీ, దేశప్రయోజనాలకూ, కార్మికుల హక్కులకూ ముప్పు తెచ్చిపెట్టే క్లీన్‌సాక్స్ మిషన్‌యొక్క ఆర్థిక ప్రణాళికలను తిరస్కరించాలనీ ఆందోళనచేస్తూంది.

బ్రెజిల్‌లో ట్రేడుయూనియన్లు జాతీయ స్వాతంత్ర్యంకోరకు, సహజసంపదలపై పూర్తిఅధికారంకోరకు సాగిస్తున్న పోరాటం ఇంకా యెక్కువ ప్రజాభిమానం చూరగొంటూంది. రేవుకార్మికుల సంఘాలు, రైల్వేకార్మికుల సంఘాలు, లోహకార్మికుల సంస్థలు, నూనెకార్మికులసంస్థలు మొదలైనవన్నీ జాతిపరంచేయబడ్డ పరిశ్రమలను, ట్రాన్స్‌పోర్టు సర్వీసులను రక్షించడానికి చాల చురుగ్గా పనిచేశాయి; విదేశీపెట్టుబడిదార్ల చేతుల్లో అవి పడిపోకుండా నిరోధించాయి. దేశంలోని ఖనిజసంపదల్ని కాపాడ్డానికి ఉద్దేశింపబడ్డ ఒక మహాసభలో (1956 జూన్) అనేక బ్రెజిలియన్ ట్రేడ్‌యూనియన్ల ప్రతినిధులు పాల్గొని, అమెరికాకు ముడియురేనియం ఎగుమతి కాకుండా నిరోధించేటట్లు ప్రభుత్వంమీద ఒత్తిడి చేయగలిగారు. ఫెర్నాండో డీరోన్హా అను దీవిని అమెరికాకు స్వాధీనం చేయరాదన్న ప్రజాందోళనను ట్రేడ్‌యూనియన్లు 1957 ప్రారంభం నుంచీ గట్టిగా బలపరుస్తూనే ఉన్నాయి. గైడెడ్ మిస్సిలీల ప్రయోగ పరీక్షలకు ఆ దీవిని ఒక సైనిక స్థావరంగా ఉపయోగించుకోవాలని అమెరికన్లు చూస్తున్నారు.

కార్మికుల హక్కులను కాపాడేందుకు జరిగిన సమ్మెలలో ముఖ్యమైనవి రియోగ్రాండ్ డీసుల్‌లోని 3,50,000 మంది కార్మికుల సమ్మె, సావోపాలోని 10,00,000 మంది కార్మికులు చేసిన సమ్మె. ఈరెండు సమ్మెలూ జయప్రదమయాయి. 1956 లో

కనీస వేతనాలను పెంచాలనే డిమాండుకోసం పిటిషన్లు, ప్రదర్శనలు, సభలు, సార్వజనీన సమ్మెలు అనేకం జరిగాయి. వీటిని అన్నితరగతుల ప్రజలు బలపరిచారు. ఈ పోరాటాలు ట్రేడ్‌యూనియన్ ఐక్యతకై సాగుతున్న ఉద్యమాన్నెంతో అభివృద్ధి చేశాయి. సావోపా రాజ్యంలో వివిధ ట్రేడ్‌యూనియన్ల మధ్య ఐక్యత సాధించడానికి యీమధ్యనే ఒక ఒడంబడిక జరిగింది. అది యిప్పుడు అన్ని ట్రేడ్‌యూనియన్లను సమన్వయపరిచే ఒక లైజాన్ సంస్థగా రూపొందింది. దానికి అనుబంధింపబడిన ట్రేడ్‌యూనియన్లలో 15 లక్షలమంది కార్మికులు సభ్యులుగా ఉన్నారు. 1957 ఏప్రిల్ 26 వ తేదీని జరిగిన మహాసభకు 58 యూనియన్ల తరఫున 567 గురు ప్రతినిధులు హాజరయ్యారు. ఆ మహాసభ 10 కోర్కెలతో కూడిన ఒక ప్రణాళికను ప్రభుత్వంముందుంచింది. వాటిలో ముఖ్యమైనవి: జీవితావసరవస్తువుల ధరలను తగ్గించడం, జాతీయ పరిశ్రమలను అభివృద్ధిచేయడం, భూసంస్కరణలను అమలు జరపడం, ట్రేడ్‌యూనియన్లకు స్వేచ్ఛ, సమ్మెచేయడానికిహక్కు, సాంఘిక భద్రత, ప్రజాస్వామ్యహక్కుల రక్షణ.

ఉరుగ్వేలో 1955 తర్వాత ట్రేడ్‌యూనియన్ ఉద్యమాన్ని ఐక్యపరచేటందుకు గట్టి ప్రయత్నాలు జరిగాయి లోహకార్మికులు, రెఫ్రిజరేషన్ ఫ్యాక్టరీలలో పనిచేసే కార్మికులు జనరల్ యూనియన్ ఆఫ్ వర్కర్స్ (ప్రపంచ ట్రేడ్‌యూనియన్ సమాఖ్యకు అనుబంధింపబడ్డ సంస్థ) సహాయంతోను, కాన్ఫెడరేషన్ ఆఫ్ ట్రేడ్ యూనియన్స్ (ఐ. సి. ఎఫ్. టి. యు.కు అనుబంధింపబడ్డ సంస్థ) సహాయంతోను, అనేక స్వతంత్ర ట్రేడ్‌యూనియన్ సంస్థల తోడ్పాటుతోను ఎన్నో జాతీయ పోరాటాలు జరిపారు. 87 స్వతంత్ర ట్రేడ్‌యూనియన్ సంస్థల తరఫున 97 గురు ప్రతినిధులు యునైటెడ్ జనరల్ ట్రేడ్‌యూనియన్ సమాఖ్య నాల్గవ మహాసభలో పాల్గొన్నారు. తదనంతరం యివన్నీ ఒకే సంస్థగా పనిచేయడానికి ఒక సమన్వయ కమిటీ ఎన్నుకోబడింది. అందులో యునైటెడ్

జనరల్ ట్రేడ్‌యూనియన్ సమాఖ్య ప్రతినిధులు, స్వతంత్ర ట్రేడ్‌యూనియన్ సంస్థల ప్రతినిధులు సభ్యులు. ఇలాగే షాళి పరిశ్రమ లోను, ఆహార రసాయనిక పరిశ్రమల్లోను, రేవుకార్మికులమధ్య సమన్వయ కమిటీలు లేదా ఐక్యకమిటీలు ఒకదానితర్వాత ఒకటి స్థాపింపబడ్డాయి. ప్రభుత్వోద్యోగుల విషయంకూడా యింతే. 80 ట్రేడ్‌యూనియన్లకు చెందిన 1,50.000 మంది కార్మికులు సమన్వయకమిటీ పిలుపునందుకొని, "టాం బోస్" కార్మికుల పోరాటాన్ని బలపరుస్తూ సమ్మెచేశారు. గృహనిర్మాణ కార్మికులు, లోహ పరిశ్రమ కార్మికులు, ఆహార పరిశ్రమ కార్మికులు, పట్టణ ట్రాన్స్‌పోర్టు కార్మికులు, రేవు కార్మికులు, నౌకా కార్మికులు, పొగాకు కార్మికులు, ప్రభుత్వోద్యోగులు ఐక్య కార్యాచరణ ద్వారా తమ జీతాలను 100 కి 25 నుంచి 30 వరకు పెంచుకో గలిగారు. ప్రస్తుతం యునైటెడ్ జనరల్ ట్రేడ్‌యూనియన్ సమాఖ్య ట్రేడ్‌యూనియన్ ఐక్యతను సాధించేందు కనుసరించ వలసిన విధానాలను చర్చించవలసిందని దేశంలోని కార్మికులందరికీ విజ్ఞప్తి చేస్తూంది.

ఆర్జంటైనాలో కార్మికులు యీ మధ్య తమ స్థితిగతులను బాగుపరచుకోడానికి, ట్రేడ్‌యూనియన్ హక్కులను రక్షించుకో డానికి చాలా కృషిచేశారు. 1954 లో 1,70,000 మంది లోహ కార్మికులు 15 రోజులు సమ్మెచేసి, జీతాల పెంపుదలను సాధించుకో గలిగారు. 1955 లో జరిగిన సార్వజనీన సమ్మె ఎంతశక్తివంతంగా కొనసాగిందంటే, సైనికనియంతృత్వ ప్రభుత్వంకూడా ట్రేడ్‌యూని యన్ కేంద్రాన్ని రద్దుచేయలేకపోయింది. 1956 చివరి భాగంలో 3,00,000 మంది ప్రెస్ కార్మికులు, లోహ కార్మికులు నెలరోజులకు పైగా సార్వజనీన సమ్మె జరిపారు. 1957 జనవరిలో జరిగిన 2,00,000 మంది రైల్వే కార్మికుల సమ్మెను అణచేందుకు ప్రభుత్వం సైనికుల్నికూడా పంపింది; సమ్మె అమానుషమైన నిర్బంధాలకు లోనైంది. ఆర్జంటైనా కార్మికులు పదేపదే పట్టుదలతో అనేక

పోరాటాలు జరిపి ఖచ్చితమైన విజయాలు సాధించారు. ఈ మధ్యనే ఆర్జెంటైనా ప్రభుత్వం అనేకమంది ట్రేడ్ యూనియన్ నాయకుల్ని జైళ్ళనుంచి విడుదల చేయవలసి వచ్చిందంటే, అది కార్మికుల ఒత్తిడి ఫలితమేనని చెప్పాలి. అనేక ట్రేడ్ యూనియన్లలో కార్మికులు సైనికుల పెత్తనాన్ని పటాపంచలొనర్చి తమ నాయకుల్ని తాము ఎన్నుకున్నారు. కార్మిక నాయకుల్ని డబ్బుకొనివేయడానికి, ట్రేడ్ యూనియన్లను చీల్చడానికి ప్రభుత్వం చేసిన ప్రయత్నాలను కార్మికులు ఓడించివేశారు. ఇదివరకెన్నడూ లేనంత ఐక్యతను వారు నిర్మించుకున్నారు. ట్రేడ్ యూనియన్ హక్కులను కాపాడ్డంలోను, పోరాటాలు సాగించడంలోను కార్మికులమధ్య ఐక్యతను సాధించడానికి 1957 ఫిబ్రవరిలో 70 ట్రేడ్ యూనియన్లు, కార్మిక సమాఖ్యలు కలిసి ఒక సంయుక్త ట్రేడ్ యూనియన్ కమిటీని ఎన్నుకొన్నాయి.

క్యూబాలో అమెరికాకు అనుకూలంగా వ్యవహరించే బాటిస్టా నియంతృత్వం ట్రేడ్ యూనియన్ ఉద్యమాన్ని ఉక్కిరిబిక్కిరి చేయడానికి ప్రయత్నిస్తోంది. ఎంత కఠినమైన నిర్బంధ విధానం అమలుజరుపబడినా క్యూబన్ కార్మికవర్గం లొంగలేదు. పెట్టుబడిదారు, ప్రభుత్వం పంచదార పరిశ్రమలో పనిచేసే కార్మికుల జీతాలను తగ్గించడాని కొక పెద్ద కుట్ర జరిపినప్పుడు 1954 జనవరి, ఫిబ్రవరి మాసాల్లో 5,00,000 మంది కార్మికులు బ్రహ్మాండమైన పోరాటం జరిపి, ఆ కుట్రను భగ్నమొనర్చారు. 1955 లో రైల్వే కార్మికులు, టెలిగ్రాఫ్ పనివారు, రేడియో నిలయాలలో పనిచేసేవారు, బ్యాంకుఉద్యోగులు దేశవ్యాపితంగా సమ్మెలు, ప్రదర్శనలు జరిపారు. ఆ సంవత్సరమే డిసెంబరులో పంచదార పరిశ్రమలో పనిచేసే కార్మికులు సార్వజనీన సమ్మె జరిపి, జీతాల పెంపుదలను సాధించుకోగలిగారు; మొత్తం 65,00,000 డాలర్ల ధనం రాబట్టుకోగలిగారు. ఆ సంవత్సరంలోనే 400 మంది ఐక్య ట్రేడ్ యూనియన్ కమిటీల ప్రతినిధులు కార్మికుల కోర్కెలను

సాధించుకోడానికి, రాజకీయ వ్యవహారాల్లో ప్రజాస్వామ్యాన్ని విస్తరింపజేసుకొనేందుకు దేశవ్యాపిత మహాసభ జరుపుకున్నారు. ఆ మహాసభ ఒక జాతీయకమిటీని ఎన్నుకొంది. ముందుముందు పోరాటాలు నడపడానికి కొత్త ప్రణాళికను రూపొందించింది. అందులో జాతీయ పరిశ్రమల రక్షణ, వ్యవసాయ సంస్కరణలు, ప్రపంచశాంతి, ప్రజాస్వామ్య హక్కులు – వీటికి సంబంధించిన డిమాండు లున్నాయి.

1954 లో అమెరికన్ విదేశాంగశాఖ, యునైటెడ్ ఫ్రూట్ కంపెనీ కలిసి సాయుధ దురాక్రమణద్వారా గౌతెమాలా ప్రజాస్వామ్య ప్రభుత్వాన్ని కూలద్రోశాయి. కొత్తగా ఏర్పడ్డ నియంతృత్వ ప్రభుత్వం కార్మికుల హక్కులను, ప్రజల హక్కులను ఒకటి తర్వాత ఒకటి హరించివేసింది. నాయకులు అనేక మంది జైళ్ళలో నిర్బంధింపబడ్డారు. మొత్తం దేశమంతా భీతావహంలో ముంచెత్తబడింది. అయినా, కార్మికులు పట్టుదల వీడకుండా పోరాడుతూనే వచ్చారు. ఉదాహరణకు యీ మధ్య విద్యుచ్ఛక్తి కార్మికులు సమిష్టి ఒడంబడికద్వారా తమ జీతాలను 100 కి 10 నుండి 40 వరకు హెచ్చించుకోగలిగారు. జౌళి, గృహనిర్మాణ, రవాణా, రైల్వే కార్మికుల సంఘాలు మళ్ళీ క్రమంగా తలెత్తుతున్నాయి. కార్మికులు ట్రేడ్ యూనియన్ ఉద్యమాన్ని పునర్వ్యవస్థీకరించేందుకు, దేశానికంతటికి ఒకే ట్రేడ్ యూనియన్ సమాఖ్యను నిర్మించేందుకు కృషిచేస్తున్నారు.

పెరూలో జౌళికార్మికులు, రైల్వేకార్మికులు, బ్యాంకు ఉద్యోగులు జీతాల పెంపుదలకొరకు 1955 లోను, 1956 లోను అనేక పోరాటాలు జరిపి విజయాలు సాధించారు. 1956 లో ఓడ్రియా నియంతృత్వం పతనమైన తర్వాత పెరూలో ఐక్య జాతీయ ట్రేడ్ యూనియన్ కేంద్రం స్థాపింపబడింది.

ఇతర లాటిన్ అమెరికా దేశాల్లో జరిగిన కార్మికపోరాటాలను గురించి, ట్రేడ్ యూనియన్ ఐక్యతకై జరిగిన కృషిని గురించి కూడా

తెలుసుకోవలసియుంది. ఉదాహరణకు మెక్సికోలో జౌళికార్మికుల సంఘాలన్నీ కలిసి ఒక ఒడంబడిక చేసుకున్నాయి; అవి 70 000 మంది కార్మికులకు ప్రాతినిధ్యం వహిస్తున్నాయి. హొండూరాస్‌లో కార్మికులు 1954 లో బ్రహ్మాండమైన సమ్మె జరిపి, స్వతంత్రంగా ట్రేడ్‌యూనియన్లను నిర్మించుకొనే అధికారం సంపాదించారు. ఇతర సెంట్రల్ అమెరికన్ దేశాల్లో—ఉదాహరణకు సాల్వడార్, కోస్టరికా, నికరాగువాలలో—కార్మికులు యునైటెడ్ ఫ్రూట్ కంపెనీ అను అమెరికన్ సంస్థయొక్క దోపిడీకి వ్యతిరేకంగా పోరాడుతూ అంతకంతకు ఎక్కువగా ఐక్యమవుతున్నారు.

పై స్థూలమైన సమీక్షనుండి మనం యీ క్రింది నిర్ధారణలకు రావచ్చు:

వివిధ దేశాల పరిస్థితులు భిన్నంగా ఉండడంవల్ల ట్రేడ్ యూనియన్ ఉద్యమంయొక్క అభివృద్ధి అసమానస్థాయిలో ఉన్నప్పటికి, కొద్దిదేశాల్లో అది పరాజయాలుకూడా పొందినప్పటికి, మొత్తంమీద యీ దేశాలన్నిటిలోను ట్రేడ్‌యూనియన్ ఉద్యమం పురోగమించిందనే చెప్పాలి. ఇందుకు కారణమేమంటే, యీ దేశాల్లో ట్రేడ్‌యూనియన్ ఉద్యమం కార్మికుల హక్కులను రక్షించేటందుకు పోరాటాలను జరుపుతూనే, రెండోవైపున జాతీయ స్వాతంత్ర్యనినాదాన్ని ప్రజల్లోకి హెచ్చుగా తీసుకెళ్ళింది. కొన్ని ప్రాంతాల్లోను, కొన్ని దేశాల్లోను ఉద్యమం వేగంగా పురోగమిస్తోంది. ఇది ప్రధానంగా ట్రేడ్‌యూనియన్ ఐక్యతకై జరిగే కృషిలోను, యూనియన్లలో సభ్యులుగా చేరేవారి సంఖ్య హెచ్చుతూండడంలోను కనిపిస్తుంది.

ట్రేడ్‌యూనియన్లలో సభ్యులుగా చేరేవారి సంఖ్య బాగా ఎక్కువవడమే కాకుండా, అవి జాతీయ స్వాతంత్ర్యోద్యమానికెతో దోహదంచేయడంద్వారా ప్రజల విశ్వాసాన్ని చూరగొంటున్నాయి. అందుచేత వివిధదేశాల రాజకీయ వ్యవహారాల్లో వాటి పలుకుబడి, హోదా యిదివరకుకంటె హెచ్చింది; ఆర్థిక

సమస్యలపై అవి నిర్వహిస్తున్న పాత్రకూడా ఇదివరకటికంటె ఎక్కువ ప్రాధాన్యాన్ని కలిగియుంది.

ఈ దేశాల్లో ట్రేడ్‌యూనియన్ ఉద్యమం అభివృద్ధి చెందడం, విజయాలు సాధించడం ప్రధాన లక్షణం. అయితే, అధికసంఖ్యాక దేశాల్లో ట్రేడ్‌యూనియన్ ఉద్యమం బాగా అభివృద్ధిచెందలేదు; అనుభవం కూడా తక్కువ; దీర్ఘ కాల పోరాటాల్లో అది రాటుదేలలేదు. వర్గచైతన్యంకూడా ఉచ్ఛస్థాయిక చెందినది కాదు. ఈ కారణాలవల్ల కొన్ని ట్రేడ్‌యూనియన్ సంస్థల కార్యకలాపాల్లో అప్పుడప్పుడు ఏదో ఒకరకమైన లోపం, బలహీనత కనిపిస్తూనే వచ్చింది.

ఉదాహరణకు కొన్ని దేశాల్లో ట్రేడ్‌యూనియన్‌లు వివిధ పోరాటాలను సమన్వయపరిచి నడపడంలో, ఒక్కొక్కప్పుడు జాతీయ స్వాతంత్ర్యంకొరకు జరిపే పోరాటంలో ఐక్యసంఘటన విధులకు ఎట్టి ప్రాధాన్య మిచ్చాయంటే, కార్మికుల తక్షణ ప్రయోజనాలను నిర్లక్ష్యం చేయడంకూడా జరిగింది. ఒక్కొక్కప్పుడు సంకుచిత జాతీయవాద పొరబాట్లు, వర్గసామరస్యపు తప్పులు కూడా జరిగాయి.

కొన్ని ట్రేడ్‌యూనియన్లు ఒక్కొక్కప్పుడు కార్మికుల తక్షణ ప్రయోజనాలకు మరీ యెక్కువ ప్రాధాన్యమిచ్చి, జాతీయ స్వాతంత్ర్యం విషయంలో ఉపేక్ష వహించాయి. అవి నడిపిన పోరాటాల్లో అన్నితరగతుల ప్రజల్నీ ఐక్యపరచవలసిన కర్తవ్యాన్ని విస్మరించాయి; ఆ విధంగా తమబలాలను అవి వేరుపరచుకున్నాయి.

నిర్మాణరీత్యా, కొన్ని దేశాల్లో ట్రేడ్‌యూనియన్ ఉద్యమా లిప్పటికీ అనైక్యతతోను, చీలికలతోను బలహీనంగా వున్నాయి. చీలికలు, అంతరంగిక వైషమ్యాలు ట్రేడ్ యూనియన్ ఉద్యమంయొక్క అభివృద్ధిని కుంటుపరుస్తాయి. ఈ దేశాల కార్మికులు, ట్రేడ్‌యూనియన్లు ఐక్యతను పెంపొందించడానికి, ఉద్యమాన్ని ఏకోన్ముఖ మొనర్చడానికి తీవ్రంగా కృషి చేయ

వలసియుంది. అనేక దేశాల్లో అధికసంఖ్యాక కార్మికులు యిప్పటికీ సంఘటితులై లేరు. కొన్ని దేశాల్లో ట్రేడ్‌యూనియన్ల నిర్మాణం చక్కగా లేదు. వాటికింకా జనసామాన్యంలో తగినంత బలీయమైన పునాది ఏర్పడలేదు. ప్రత్యక్ష పోరాటాల్లో రాటుదేలిన కార్మికులు కార్యకర్తలుగాను కార్య నిర్వాహకులుగాను పనిచేసే స్థితి యింకా ఏర్పడలేదు. ఈసమస్యలన్నిటినీ పరిష్కరించడానికి ప్రయత్నించాలి.

కొన్ని దేశాల కార్మికోద్యమంలో కార్యవిధానం యిప్పటికి లోపభూయిష్టంగానే ఉంది. అదే ఒంటెత్తుపోకడ. దానివల్ల కార్మికోద్యమం ప్రజాసామాన్యానికి దూరమైంది.

ట్రేడ్‌నియూయన్ ఉద్యమం సామ్రాజ్యవాదుల కుట్రలను, వారి ఏజంట్లు చేసే విచ్ఛిన్నచర్యలను అప్రమత్తతతో పరిశీలిస్తూ ఉండాలి; వాటినుంచి ఎప్పటికప్పుడు రక్షించుకొంటూ ఉండాలి.

మనం యీ లోపాలను, పొరపాట్లను సూటిగా, కళ్లలో కళ్లుపెట్టి చూడాలి. ఈ లోపాలను పొరపాట్లను దిద్దుకొంటే ట్రేడ్ యూనియన్ ఉద్యమం యింకా ఎక్కువ వేగంగా పురోగమిస్తుందనీ, దాని బలంవల్ల యింకా చక్కని ఫలితాలు కలుగుతాయనీ, ఇంకా యెక్కువగా విస్తరించి విజయాలు సాధిస్తుందనీ గత అనుభవం మనకు బోధిస్తూంది.



# 4

# అంతర్జాతీయ ట్రేడ్‌యూనియన్ ఐక్యత: వలస విముక్తి పోరాటాల్లో సఖ్యత

జాతీయ స్వాతంత్ర్యంకోరకు, వలస విధానానికి వ్యతిరేకంగాను జరిగే పోరాటం జయప్రదమవడానికీ, వివిధదేశాల్లో కార్మిక వర్గం అంతర్జాతీయ ఐక్యతను ప్రదర్శించడానికి అవినాభావ సంబంధంవుంది; ఈ పోరాటంలో ప్రపంచ ట్రేడ్‌యూనియన్ ఫెడరేషన్, తదితర అంతర్జాతీయ కార్మిక సంస్థలు ప్రదర్శించే సంఘీభావంకూడా యీ ఐక్యతలో ఒక భాగమే. ప్రపంచ ట్రేడ్ యూనియన్ ఫెడరేషన్ పుట్టినప్పటినుంచీ (1945) వలసదేశాల స్వాతంత్ర్యాన్ని అది సమర్థిస్తూనే ఉంది. ఇందుకు అనేక నిదర్శనాలున్నాయి. అయితే, ప్రపంచ ట్రేడ్‌యూనియన్ ఫెడరేషన్ విజ్ఞప్తులను పురస్కరించుకొని ప్రపంచవ్యాపితంగా జరిగిన సుహృద్భావచర్య లన్నిటినీ యిక్కడ జాబితాగా యివ్వవలసిన అవసరం లేదు.

## వియత్నాం, తదితరదేశాల ప్రజలతో సఖ్యత

1953 లో ప్రపంచ ట్రేడ్‌యూనియన్ మహాసభ జరిగినప్పుడు వివిధదేశాలనుంచి వచ్చిన ప్రతినిధులు 1953 డిసెంబరు 18 న వియత్నాం దినోత్సవం జరపాలని ఏకగ్రీవంగా నిశ్చయించారు. ఆ రోజున "వియత్నాంలో జరిగే వలసయుద్ధాన్ని ఆపుజేయాలనీ, వియత్నాంప్రజల వీరోచిత పోరాటంపట్ల సంఘీ

భావాన్ని ప్రదర్శించాలనీ" తీర్మానింపబడింది. ఈ పిలుపును అనేకదేశాల ప్రజలు బలపరిచారు.

ట్యునీషియా, మొరాకో దేశాల ప్రజలు స్వాతంత్ర్యంకొరకు సాగించే ధర్మయుద్ధాన్నీ, అమెరికా ప్రోత్సాహంతో గౌతెమాలాపై జరిగిన సాయుధ తిరుగుబాటుకు వ్యతిరేకంగా ఆ దేశ ప్రజలు ప్రారంభించిన వీరోచిత పోరాటాన్నీ, సైప్రెస్ ప్రజలు సాయుధ నిర్బంధచర్యలకు వ్యతిరేకంగా జాతీయ స్వయం నిర్ణయ హక్కుకోసం జరుపుతున్న పోరాటాన్నీ, భారతీయులు గోవాను తిరిగి స్వాధీనమొనర్చుకోడానికి చేసిన పోరాటాన్నీ, ఇండొనేషియా ప్రజలు పశ్చిమ ఇరియన్ దీవికొరకు ప్రారంభించిన పోరాటాన్నీ, ఒకినావాదీవిపై అమెరికా పెత్తనాన్ని అంతమొందించే టందుకు జపాన్ ప్రజలు సాగిస్తున్న ప్రయత్నాలనూ, ఆఫ్రికా ప్రజలు జాతి విచక్షణకు వ్యతిరేకంగాను ప్రజాస్వామ్య హక్కులను అపహరిస్తున్న దక్షిణాఫ్రికా ప్రభుత్వ విధానానికి వ్యతిరేకంగాను జరిపే పోరాటాన్నీ—ప్రపంచ ట్రేడుయూనియన్ ఫెడరేషన్, యితర అంతర్జాతీయ ట్రేడుయూనియన్ సంస్థలు, ప్రపంచ దేశాల్లోని అనేక ట్రేడుయూనియన్లు, కార్మిక ప్రజాసామాన్యం బలపరిచాయి.

## ఈజిప్ట్ ప్రజలతో సమైక్యత

గత సంవత్సరం (1956) సూయెజ్ కాలువను జాతీయ మొనర్చడంలోను, బ్రిటిష్ - ఫ్రెంచి - ఇజ్రాయల్ దేశాల దురాక్రమణదారుల్ని ప్రతిఘటించడంలోను ఈజిప్ట్ ప్రజలు ప్రదర్శించిన దృఢనిశ్చయాన్ని, ధైర్యసాహసాలను యావత్ప్రపంచంలోని కష్టజీవులు కొనియాడారు. ఈజిప్ట్ ప్రజలకు చేయూతనిస్తూ అరబ్బు ప్రజలు, యితరదేశాల ప్రజలు చూపిన సమైక్య భావం ప్రపంచంలోని కష్టజీవులందరిలో వలసవిధానానికి వ్యతిరేకంగా పోరాడాలనే సంకల్పాన్ని కలిగించింది; ఈజిప్ట్ ప్రజలకు

అనేక దేశాల ప్రజలు అండగా నిలిచారు. అన్ని దేశాలూ ఈజిప్టుకు చేయూత నివ్వాలనే నినాదంతో కొనసాగిన ఉద్యమాన్ని బలపరచవలసిందిగా ప్రపంచ ట్రేడ్‌యూనియన్ ఫెడరేషన్ పదే పదే కార్మికులకు, కార్మిక సంస్థలకు, ఐక్యరాజ్య సమితికి విజ్ఞప్తులు చేసింది; ఈజిప్ట్ భూభాగంనుంచి దురాక్రమణశక్తుల్ని వెనక్కి రప్పించేటందుకు తీవ్రమైన చర్యలు తీసుకోవాలని డిమాండు చేసింది. ఈ విజ్ఞప్తుల ఫలితంగా కార్మికులు ప్రపంచంలో నలుమూలలా సుహృద్భావ చర్యలకు పూనుకున్నారు.

కార్మికవర్గం ప్రదర్శించిన యీ అంతర్జాతీయ సమైక్యత ఈజిప్ట్ ప్రజల పోరాటాని కెంతో చేయూత నిచ్చింది.

## ఆల్జీరియా ప్రజలతో సమైక్యత

ఆల్జీరియాలో జరుగుతున్న జాతీయ విముక్తి పోరాటాన్ని ఉత్తర ఆఫ్రికా ప్రజలు, యితర దేశాల ప్రజలు బలపరుస్తున్నారు. ఈ యేడు జనవరి మాసంలో ఆల్జీరియాలో సర్వవ్యాపిత సమ్మె జరిగినప్పుడు యించుమించు అన్ని అరబ్బు దేశాల్లోను సుహృద్భావ చర్యలు జరిగాయి.

ఈ మధ్యనే ప్రపంచ ట్రేడ్‌యూనియన్ ఫెడరేషన్‌యొక్క 14 వ కార్యవర్గ సమావేశం జరిగింది. ఆల్జీరియన్ సమస్యపై అది మరొక ప్రకటన చేసింది. అందులో జాతీయ స్వాతంత్ర్యంకొరకు ఆల్జీరియన్ ప్రజలు, కార్మికులు సాగిస్తున్న పోరాటం యెడల తిరిగి తన ఏకీభవాన్ని తెలియజేసింది.

## సామ్రాజ్యవాదదేశాల కార్మికులిచ్చిన తోడ్పాటు

సామ్రాజ్యవాదదేశాల కార్మికులు, ట్రేడ్‌యూనియన్లు యిచ్చిన తోడ్పాటునుగురించి కూడా ఈ సందర్భంలో పేర్కొనడం అవసరం.

సామ్రాజ్యవాదదేశాల పాలకవర్గాలు జరిపే వలసయుద్ధాలు ఆ దేశాల ప్రజల్నికూడా బాధిస్తాయి. ఉదాహరణకు ఫ్రెంచి

సామ్రాజ్యవాదులు ఆల్జీరియాలో పరమనీచంగా సాగిస్తున్న యుద్ధంలో రోజుకి 100 కోట్ల ఫ్రాంకులు ఖర్చు అవుతున్నాయి. ఫ్రెంచి కష్టజీవుల జీవనప్రమాణం అతి త్వరితంగా పడిపోతూండం కే అందుకు ప్రధానకారణాల్లో యిదొకటి.

ఈ మధ్య ఈజిప్టుపై బ్రిటిష్, ఫ్రెంచి పాలకులు చేసిన దురాక్రమణకూడా బ్రిటన్, ఫ్రాన్స్, తదితర యూరపియన్ పెట్టుబడిదారీ దేశాల్లో కార్మికుల స్థితిగతుల్ని అధ్వాన్నస్థితికి తెచ్చింది.

సామ్రాజ్యవాదదేశాల్లో కార్మికవర్గం, ట్రేడ్‌యూనియన్లు తమ సొంత ప్రయోజనాల్ని కాపాడుకొనేందుకు, పీడిత దేశాల్లో తమ వర్గ మిత్రులైనవారికి చేయూత నిచ్చేటందుకు వలసవిధానానికి వ్యతిరేకంగా పోరాడుతున్నాయి.

వియత్నాం ప్రజల పోరాటాన్ని బలపరుస్తూ ప్రారంభమైన ఉద్యమంలో ఫ్రెంచి కార్మికులు ఫ్రెంచి సి. జి. టి. పిలుపునందుకొని వందలాదిగా సభలు జరిపారు. కొద్దిసేపుమాత్రమే జరిగే సమ్మెలు, పనిచేసే స్థలాల్లో ఓట్లు తీసుకోడం మొదలైన వెన్నో జరిగాయి. ఫ్రెంచి సామ్రాజ్యవాదులు ఎంతో అయిష్టంగా యుద్ధవిరమణకు అంగీకరించవలసి వచ్చిందం టే, యిట్టి చర్యలు అందుకు చాలవరకు తోడ్పడ్డాయని చెప్పవలసియుంటుంది.

ఫ్రెంచి కార్మికులీరోజున సి. జి. టి. పిలుపు నందుకొని ఫ్రెంచి ప్రభుత్వంయొక్క సైనిక నిర్బంధాలకు వ్యతిరేకంగా, నిర్విరామంగా పోరాడుతున్నారు. సమ్మెలు, ప్రదర్శనలు, పార్లమెంటుకు విజ్ఞప్తులు మొదలైన వాటిద్వారా కార్మికులు ఆల్జీరియన్ సమస్యను శాంతియుతంగా పరిష్కరించాలని డిమాండుచేస్తున్నారు. ఫ్రాన్సులో ఆల్జీరియన్ కార్మికులు సాగించే పోరాటాన్ని ఫ్రెంచి కార్మికులు బలపరుస్తున్నారు.

మరో స్పష్టమైన ఉదాహరణ- ఈజిప్ట్‌ప్రజల పోరాటానికి బ్రిటిష్ కార్మికులు అండగా నిలబడ్డం. బ్రిటిష్‌కార్మికులు యిట్టి

సుహృద్భావాన్ని ప్రదర్శించడం యిటీవలి సంవత్సరాల్లో చాల అరుదు. ఈ సందర్భంలో అనేక పోరాటరూపాలు ప్రదర్శితమయాయి. ఊరేగింపులు, సభలు ఎన్నో జరిగాయి. సమ్మెలు జరపవలసిందని విజ్ఞప్తులు చేయబడ్డాయి. ట్రేడ్‌యూనియన్ కాంగ్రెస్, లేబర్‌పార్టీ, సహకారసంఘాలు కలిసి ఎన్నుకొన్న నేషనల్‌కౌన్సిల్ ఆఫ్ లేబర్ 1956 నవంబరు 4 వ తేదీని బ్రహ్మాండమైన ఒక సభ జరిపింది. అంత పెద్దసభ యిటీవలికాలంలో జరగ లేదు.

ఈవిధంగా. పెట్టుబడిదారీదేశాల్లో కష్టజీవులుచేసిన పోరాటం బ్రిటిష్, ఫ్రెంచి దురాక్రమణను నిలుపుచేయడంలో సహాయకారిగా పనిచేసింది.

## ట్రేడ్‌యూనియన్ హక్కుల రక్షణకు ఐక్యకృషి

ట్రేడ్‌యూనియన్ హక్కుల విషయంలో వివిధ దేశాల కార్మికులమధ్య ఐక్యతను నిర్మించడానికి అనేక ఉద్యమాలు నడిచాయి. ప్రపంచ ట్రేడ్‌యూనియన్ ఫెడరేషన్‌యొక్క జనరల్ కౌన్సిల్ 7 వ సమావేశం తయారుచేసిన హక్కుల ప్రణాళిక ప్రపంచ దేశాల్లో కార్మికులు సాగిస్తున్న ఉద్యమాని కెంతో సహాయపడింది.

1956 జనవరిమాసంలో సి. యు. టి. సి హెచ్. నడిపిన సర్వవ్యాపితసమ్మె (పైనపేర్కొనబడింది) అమానుషమైన నిర్బంధ విధానానికి గురిఅయింది. వందలాది ట్రేడ్‌యూనియన్ మిలిటెంట్లు అరెస్టు చేయబడ్డారు. లాటిన్ అమెరికా దేశాల, తదితర దేశాల కార్మికులు, ప్రపంచ ట్రేడ్‌యూనియన్ ఫెడరేషన్ ఎంతో తీవ్రంగా ఆందోళన చేయడంవల్లనే వారిలో అధికసంఖ్యాకులు విడుదల చేయబడ్డారు.

మరొక ఉదాహరణ: అర్జెంటైనా మొదలైన దేశాల్లో ట్రేడ్‌యూనియన్లు ప్రజాస్వామ్య పద్ధతులపై స్వతంత్రంగా నిర్మింప

బడాలనే ఉద్యమానికి నాయకత్వం వహించిన కార్మిక నాయకులందరినీ విడుదల చేయించడానికి ప్రపంచ ట్రేడ్‌యూనియన్ ఫెడరేషన్ తీవ్రంగా ప్రయత్నించింది. ఈయేడు జనవరిమాసంలో వారి విడుదలను కోరుతూ ఉరుగ్వే ట్రేడ్‌యూనియన్లు అర్జెంటైనాకు ఒక రాయబారవర్గాన్ని పంపాయి. దాని సభ్యులు అర్జెంటైనాలోని ట్రేడ్‌యూనియన్లన్నిటితోను సంబంధా లేర్పరచుకొని, శాంతారోజా జైల్లో నిర్బంధింపబడియున్న తమ సోదరుల్ని కలుసుకున్నారు. అర్జెంటైనా కార్మికులు, యితర దేశాల కార్మికులు చేసిన కృషి ఫలితంగా వా రిప్పుడు విడుదలచేయబడ్డారు.

ఐక్యరాజ్యసమితియొక్క ఆర్థిక, సాంఘిక వ్యవహారాల సమితిలోను, అంతర్జాతీయ కార్మికసమాఖ్య (ఐ. ఎల్. ఓ.) లోను జాతీయ స్వాతంత్ర్యంపొందిన దేశాల ప్రయోజనాల్ని కాపాడేటందుకు, ఆ దేశాల్లోని కార్మికుల ట్రేడ్‌యూనియన్ల హక్కులను రక్షించడానికి ప్రపంచ ట్రేడ్‌యూనియన్ ఫెడరేషన్ నిర్విరామంగా కృషిచేస్తూంది.

## స్నేహసంబంధాల పెంపుదలకు కృషి

వివిధదేశాల కార్మికులు వలసవిధానానికి వ్యతిరేకంగా సాగించే ఉమ్మడిపోరాటంలో అన్యోన్య స్నేహసంబంధాలు వృద్ధి చెందుతున్నాయి. వేర్వేరు అంతర్జాతీయ సంస్థలకు అనుబంధింపబడ్డ ట్రేడ్‌యూనియన్లు వేసికవి వేరుగాఉండే స్థితి యిప్పుడులేదు. ప్రపంచ ట్రేడ్‌యూనియన్ ఫెడరేషన్‌కి అనుబంధింపబడ్డ యూనియన్లు ఆసియా - ఆఫ్రికాలలో అనేక ఇతర యూనియన్లతో వేర్వేరుగా అన్యోన్యసంబంధాలు పెంపొందించుకుంటున్నాయి. ఈ ప్రాంతంలో అవి తమ పొరుగుదేశాలతో రాకపోకలు సాగించడమేకాక, ఐ. సి. ఎఫ్. టి. యు. కి అనుబంధింపబడ్డ అనేక యూనియన్లతో స్నేహసంబంధాలు పెంపొందించుకొంటున్నాయి. లాటిన్ అమెరికన్ దేశాల ట్రేడ్‌యూనియన్లతోకూడ దగ్గర

సంబంధాలుంచుకోడానికి ప్రయత్నిస్తున్నాయి. జాతీయ స్వాతంత్ర్యం కొరకు పోరాడే దేశాల ట్రేడ్‌యూనియన్‌లకు ఫ్రాన్సు, ఇటలీ, జపాన్ మొదలైన పెట్టుబడిదారీ దేశాలకు మధ్య సంబంధాలు కూడా అభివృద్ధిచెందుతున్నాయి.

ఇట్టి సంబంధాలే వేర్వేరు దేశాల ట్రేడ్‌యూనియన్ సమాఖ్యలమధ్య వేర్వేరు పరిశ్రమలకుచెందిన ట్రేడ్‌యూనియన్‌ల మధ్య పెంపొందుతున్నాయి.

ఇంకా జాతీయ స్వాతంత్ర్యం సంపాదించుకోని దేశాల కార్మికులు, ట్రేడ్‌యూనియన్లు స్వతంత్ర దేశాల కార్మికులనుంచి, ట్రేడ్‌యూనియన్లనుంచి సహాయం పొందడానికి ఉవ్విళ్ళూరుతున్నారు. ఆ దేశాల అనుభవంనుంచి పాఠాలు నేర్చుకోవాలనుకుంటున్నారు.

ఈమధ్య అఖిల చైనా ట్రేడ్‌యూనియన్ ఫెడరేషన్, అరబ్బు దేశాల ట్రేడ్‌యూనియన్ ఫెడరేషన్ కలిసి చేసిన ప్రకటనలో సామ్రాజ్యవాదుల దురాక్రమణకు వ్యతిరేకంగా అరబ్బుప్రజలు చేస్తున్న పోరాటాన్ని బలపరిచారు; ఆసియా - ఆఫ్రికా దేశాల ట్రేడ్‌యూనియన్ల మధ్య ఐక్యతను పెంపొందించుకోవలసిన అవసరాన్ని తెలియజేశారు; యిందుకు దోహదమిచ్చేటట్లు ఆసియా - ఆఫ్రికా దేశాల ట్రేడ్‌యూనియన్ మహాసభ ఒకటి జరపడం అవసరమన్నారు. 1957 మే మాసంలో అఖిలచైనా ట్రేడ్‌యూనియన్ ఫెడరేషన్ ప్రతినిధులు, అరబ్బుదేశాల ట్రేడ్‌యూనియన్ ఫెడరేషన్ ప్రతినిధులు కలిసి ఒక సంయుక్త ప్రకటన చేస్తూ, తాము యిట్టి సమావేశాన్నేర్పాటు చేయదలచుకున్నట్లు తెలియజేశారు.

ఆసియా - ఆఫ్రికా దేశాల కార్మికులు అన్యోన్యంగా స్నేహ సంబంధాలుంచుకోడానికి చేస్తున్న యీ ప్రయత్నాలను ప్రపంచ ట్రేడ్‌యూనియన్ ఫెడరేషన్ బలపరుస్తుంది. ఇదివరలో ఏదో ఒక రకమైన "ఆసియా - ఆఫ్రికా ట్రేడ్‌యూనియన్ మహాసభ" జరప

డానికెన్నో ప్రయత్నాలు జరిగాయి. కాని అవి ఫలించలేదు. ఎంతో విస్తృతమైనఆసియా-ఆఫ్రికా ట్రేడ్‌యూనియన్ మహాసభమాత్రమే అన్ని దృక్పథాల ట్రేడ్‌యూనియన్లను యిముడ్చుకోగల మహాసభ మాత్రమే, ఏ విధమైన పక్షపాత దృష్టిలేని మహాసభ మాత్రమే, వలస విముక్తి పోరాటంపై తన దృష్టిని కేంద్రీకరిస్తూ, ప్రపంచ శాంతిని రక్షించడానికి, కార్మికుల స్థితిగతులను మెరుగుపరచడానికి, ప్రపంచ కార్మికులమధ్య ఐక్యతను పెంపొందించడానికి కృషిచేసే మహాసభ మాత్రమే—లక్షలాది ఆసియా, ఆఫ్రికా కార్మికుల కోర్కెలను యీడేర్చగలదనీ, కార్మికుల పోరాట దీక్షను పెంపొందించగలదనీ స్పష్టమైంది. పై రెండు ట్రేడ్‌యూనియన్ సంస్థలూ జరపదలచుకున్న మహాసభ విస్తృతమైనదిగాను, నిష్పాక్షికమైనదిగాను ఉంటుందని ఆశిద్దాం. ఆ రెండు సంస్థల కృషిఫలితంగాను ఆసియా - ఆఫ్రికాదేశాల్లోని ట్రేడ్‌యూనియన్ సంస్థల కృషి ఫలితంగాను యీ వాంఛ ఫలించితీరుతుందనే విశ్వాసం ప్రపంచ ట్రేడ్‌యూనియన్ ఫెడరేషన్‌కివుంది.

అదే సమయంలో మరో విషయాన్ని కూడా మనం గమనించాలి ; లాటిన్ అమెరికా, ఆసియా, ఆఫ్రికాదేశాల కార్మికుల్లో యితర విధాలుగా కూడ స్నేహసంబంధాలను పెంపొందించుకోవాలన్న వాంఛ ఎక్కువవుతూంది.

## స్వతంత్ర సంస్థలతో ఐక్యకార్యాచరణ

ఈ నివేదికలో పేర్కొనబడిన ప్రాంతాలలో (అంటే మధ్యప్రాచ్యంలోను, లాటిన్ అమెరికాదేశాల్లోను, ఆగ్నేయాసియా దేశాల్లోను) ఏ అంతర్జాతీయ సంస్థకూ అనుబంధింపబడని ట్రేడ్‌యూనియన్లు చాలా ఉన్నాయి. ఇటీవలి కాలంలో అవి వలసవిధానానికి వ్యతిరేకంగాను, జాతీయ స్వాతంత్ర్యాన్ని సాధించేటందుకు జరుగుతున్న పోరాటానికి గణనీయంగా సహాయం చేశాయి. ప్రపంచశాంతిని కాపాడ్డంలోను, వివిధదేశాల

ట్రేడ్‌యూనియన్ల మధ్య ఐక్యతను సాధించడంలోను కూడా అవి కొంత పాత్ర నిర్వహించాయి. ఉదాహరణకు అంతర్జాతీయ అరబ్బు ట్రేడ్‌యూనియన్ కాన్ఫెడరేషన్, ఈజిప్ట్ ట్రేడ్ యూనియన్ కాన్ఫెడరేషన్ ఈజిప్టుయొక్క తదితర అరబ్బుదేశాల యొక్క స్వాతంత్ర్యాన్ని రక్షించేందుకు కార్మికుల్ని సమీకరించి, తద్వారా ఎంతో ముఖ్యమైన పాత్ర నిర్వహించాయి.

జపాన్ ట్రేడ్‌యూనియన్ల జనరల్ కౌన్సిల్ (సోహియో) అమెరికన్ సైనిక స్థావరాలకు, జపాన్‌లో సైనిక పునరుద్ధరణకు వ్యతిరేకంగా సాగించిన పోరాటం అందరికీ తెలుసు. చిలియన్ కార్మికవర్గం ఆర్థిక తదితరరంగాల్లో అమెరికన్ దురాక్రమణకు వ్యతిరేకంగా తమ ప్రాథమిక హక్కులకోసం వీరోచితంగా జరిపిన పోరాటానికి చిలీ యునైటెడ్ ట్రేడ్‌యూనియన్ సెంటరు నాయకత్వం వహించింది. ఈమధ్యనే స్థాపింపబడిన నీగ్రో ఆఫ్రికా జనరల్ యూనియన్ ఆఫ్ వర్కర్స్ అనే సంస్థ వలసవిధానం నుంచి విముక్తి చెందడానికి, శ్రామికవర్గ అంతర్జాతీయత అనే సూత్రాన్ని ఆధారంచేసుకొని యితర దేశాల కార్మికులతో ఐక్యతను పెంపొందించుకోడానికి తన దృఢనిశ్చయాన్ని తెలియ జేసింది.

జాతీయ ప్రయోజనాలను, కార్మికుల హక్కులను కాపాడ్డంలో, అంతర్జాతీయ సమైక్యతను అభివృద్ధిచేయడంలో స్వతంత్ర ట్రేడ్‌యూనియన్ సంస్థలు సక్రమమైన మార్గాలు చేబట్టగలవనీ, సమస్తమైన కష్టాలను, ఆటంకాలను అధిగమిస్తూ నిరంతరం ప్రగమిస్తూ ఉండగలవనీ హృదయపూర్వకంగా ఆశిద్దాం.

ప్రపంచ ట్రేడ్‌యూనియన్ ఫెడరేషన్ ఏ ట్రేడ్‌యూనియన్ సంస్థతోనైనాసరే సహకరించడానికి, కలిసి పనిచేయడానికి సిద్ధంగా ఉంది. అది ఏ అంతర్జాతీయ సంస్థకు అనుబంధింపబడినా, లేక స్వతంత్ర సంస్థగా పనిచేస్తున్నా పట్టించుకోదు. ప్రపంచ

కార్మికుల ప్రాథమిక ప్రయోజనాలకు మాత్రం దాని పాలసీ అనుగుణంగా ఉండాలి.

ఈ ప్రాతిపదికమీద ప్రపంచ ట్రేడ్‌యూనియన్ ఫెడరేషన్ జాతిభేదాలనుగాని, మతభేదాలనుగాని, రాజకీయ భేదాలనుగాని, యితర విచక్షణాలనుగాని పాటించకుండా కార్మికులమధ్య ఐక్యతను సాధించాలన్న తన విధానాన్ని నిరంతరం అమలుజరుపుతూ ఉంటుంది. ఇతరులమీద బలవంతంగా శిక్షణచర్యలు తీసుకోనేందుకుగాని, సిద్ధాంత ధోరణులను రుద్దడానికిగాని ఎవరైనా స్వీయ మానసికతత్వంతో ప్రయత్నిస్తే, అట్టి ప్రయత్నాలను ప్రపంచ ట్రేడ్‌యూనియన్ ఫెడరేషన్ వ్యతిరేకిస్తుంది. కనుకనే అది అనేక స్వతంత్ర సంస్థలతోను తనకు అనుబంధింపబడని యితర సంస్థలతోను స్నేహసంబంధాలను పెంపొందించుకోగల్గుతుంది.

## ఐ. సి. ఎఫ్. టి. యు. కార్యకలాపాలు

వలస విముక్తి పోరాటాలు అంతకంతకు అభివృద్ధి చెందుతూండడంవల్ల, ఆసియా - ఆఫ్రికా - లాటిన్ అమెరికా దేశాల్లో ట్రేడ్‌యూనియన్ ఉద్యమం బలపడుతూండడంవల్ల యీ ప్రాంతంలో ఐ. సి. ఎఫ్. టి. యు. యొక్క కార్యకలాపాలను మనం శ్రద్ధతో పరిశీలించవలసియుంది.

ఐ. సి. ఎఫ్. టి. యు. తో సహా ప్రతి అంతర్జాతీయ ట్రేడ్‌యూనియన్ సంస్థ కార్యకలాపాలకు మనం స్వాగతం చెబుతాం. అయితే అది నిజంగా జాతీయ స్వాతంత్ర్యంకొరకు కృషిచేసేదిగా ఉండాలి; కార్మికుల ప్రయోజనాలను కాపాడేదిగా ఉండాలి; ట్రేడ్‌యూనియన్ ఉద్యమంలో ఐక్యతను వాంఛించేదిగా ఉండాలి. కాని, కొందరు ఐ. సి. ఎఫ్. టి. యు. నాయకులు యీ ప్రాంతాల్లో ట్రేడ్‌యూనియన్ ఐక్యతకు హానికలిగించే చర్యలకు పూనుకున్నారని మన మెరుగుదుం. అందుచేత మనం వాటియెడల అప్రమత్తతతో మెలగాలి.

జాతీయ స్వాతంత్ర్యం కొరకు పోరాడేదేశాల్లో ట్రేడ్ యూనియన్ల వలసవిధాన వ్యతిరేక ధోరణులను ఐ. సి. ఎఫ్. టి. యు. నాయకులు కొందరు తక్కువచూపు చూస్తున్నారు. ఈ విధానంవల్ల ఆసియాలోని, ఈజిప్టులోని కొన్ని ఫెడరేషన్లు ఐ. సి. ఎఫ్. టి. యు. నుంచి విడిపోయాయి. ఆసియా, ఆఫ్రికా దేశాల్లో ఆ సంస్థయొక్క ప్రతిష్ట దెబ్బతింది. ఉదాహరణకు ఐ. సి. ఎఫ్. టి. యు. చే ఒకినావాదీవికి పంపబడిన విచారణసంఘం తన నివేదికలో ఆ దీవి యికముందుకూడా అమెరికన్ సైనికుల ఆక్రమణక్రింద ఉండవచ్చునని (ప్రస్తుత అంతర్జాతీయ ఉద్రిక్తత కారణంగా) వ్రాశారు. అప్పుడు ఐ. సి. ఎఫ్. టి. యు. కు అనుబంధింపబడిన జపాన్ ట్రేడ్‌యూనియన్లు ఒకినావా సమస్యపై ఆ సంస్థ ప్రదర్శించిన వైఖరిని చాల తీవ్రంగా ఖండించాయి.

జాతీయ స్వాతంత్ర్యంకొరకు పోరాడే దేశాల్లో మరికొన్ని ట్రేడ్‌యూనియన్లు ఐ. సి. ఎఫ్. టి. యు. లో ఉంటూన్నప్పటికీ, దాని నాయకులు అనుసరించే విధానాలయెడ వాటి అసంతృప్తి నానాటికి పెరుగుతోంది. అవి ఐ. సి. ఎఫ్. టి. యు. లో ఉంటూనే అనేక సమస్యలపై స్వతంత్రవిధానం అవలంబిస్తున్నాయి.

1955 లో ఐ. సి. ఎఫ్. టి. యు. చతుర్థమహాసభలో జాతీయ స్వాతంత్ర్యం, ప్రపంచశాంతి, తటస్థవిధానం, సోషలిస్టు దేశాలకు రాయబారవర్గాలను పంపడం మొదలైన సమస్యలపై ఆసియా - ఆఫ్రికా దేశాల గ్రూపు అమెరికన్, బ్రిటిష్, ఫ్రెంచి వారి ప్రాబల్యంక్రిందనున్న ఐ. సి. ఎఫ్. టి. యు. నాయకత్వాన్ని తీవ్రంగా వ్యతిరేకించింది. మహాసభలో ఎ. ఎఫ్. ఎల్.—సి. ఐ. ఓ. (అమెరికన్ కార్మికసంస్థ) అధ్యక్షుడు జి. మీనీ భారత ప్రధాని నెహ్రూపై దుష్ప్రచారం ప్రారంభించాడు. నెహ్రూ తటస్థవిధాన మవలంబించడం లేదనీ, "యదార్థంగాను, కార్యరూపంలోను అతడు కమ్యూనిజాన్ని బలపరిచే, అభిమానించే వ్యక్తి" అనీ అతడు అన్నాడు. వెంటనే భారత జాతీయ ట్రేడ్‌యూనియన్ కాంగ్రెసు,

తదితర సంఘాలు మిానీని, ఐ. సి. ఎఫ్. టి. యు. ను తీవ్రంగా ఖండించి, దూషించాయి.

ఈమధ్య జరిగిన ఐ. సి. ఎఫ్. టి. యు. మహాసభలో వలస విధానానికి వ్యతిరేకంగా ఆల్జీరియా ప్రజలు సాగిస్తున్న పోరాటాన్ని బలపరచడమా మానడమా అనే సమస్యపై అభిప్రాయభేదాలు వచ్చాయి. వలసవిధానాన్ని దృఢనిశ్చయంతో వ్యతిరేకించే అరబ్బు ట్రేడ్‌యూనియన్ల అంతర్జాతీయ సమాఖ్యను కొందరు ఐ. సి. ఎఫ్. టి. యు. నాయకులు గర్హిస్తూ ఉపన్యసించారు. జె. హెచ్. ఓల్డెన్ బ్రూక్ యిలా అన్నాడు:

"అరబ్బు ఫెడరేషన్ యెడల స్వేచ్ఛాయుత సంఘాలు తటస్థంగా ఉండడం సాధ్యంకాదు; కమ్యూనిస్టుల పెత్తనంక్రింద ఉన్న ప్రపంచ ట్రేడ్‌యూనియన్ ఫెడరేషన్‌వలెనే అదికూడా స్వేచ్ఛాయుత సంఘాలకు బద్ధశత్రువు."

మహాసభ జరుగుతుండగా ఐ. సి. ఎఫ్. టి. యు. నాయకులు ఆసియా - ఆఫ్రికా ట్రేడ్‌యూనియన్ల సమావేశాన్నొక దాన్ని పిలిచారు. వారి ఉద్దేశం ఆసియా, ఆఫ్రికాదేశాల ప్రజల్ని వంచించడం, వలసవిధానాన్ని వ్యతిరేకించే నినాదాలకు బదులు కమ్యూనిస్టు వ్యతిరేక, సోవియట్ వ్యతిరేక నినాదాలను ప్రవేశపెట్టడం. అయినప్పటికీ మహాసభ వలస విధానానికి వ్యతిరేకమైన భావాలనే వ్యక్తీకరించవలసి వచ్చింది. మహాసభకు హాజరైన ట్రేడ్‌యూనియన్ ప్రతినిధుల్లో అత్యధిక సంఖ్యాకులు కమ్యూనిస్టు వ్యతిరేక, సోవియట్ వ్యతిరేక పన్నాగాలలో పడలేదు. పరాధీన దేశాలకు సత్వరమే జాతీయ స్వాతంత్ర్య మవసరమని వారు డిమాండు చేశారు. ఇవన్నీ ఐ. సి. ఎఫ్. టి. యు. లో వలస విధానానికి వ్యతిరేకంగా జరిగే పోరాటానికి నిదర్శనాలు. ఈ ధోరణి ముందు ముందు మరింత బలపడవచ్చు.

మన మెల్లప్పుడు ఒక విషయాన్ని దృష్టిలో ఉంచుకోవాలి: జాతీయ స్వాతంత్ర్యం పొందిన దేశాలపై దురాక్రమణకు పూను

కొన్న అమెరికా ప్రభుత్వం అమెరికన్ ట్రేడ్‌యూనియన్ల నాయకుల్లో కొంత మందిని తన తాబేదార్లుగా ఉపయోగించుకొంటూంది.

ఉదాహరణకు, ఈ యేడు పూర్వార్థ భాగంలో అమెరికా ఉపాధ్యక్షుడు నిక్సన్ ఆఫ్రికా పర్యటించి వచ్చాక తన నివేదికలో యిలా తెలియ జేశాడు. "ఆఫ్రికా ఖండంలో జరిగే ట్రేడ్ యూనియన్ కార్యకలాపాలను గురించి అమెరికా ప్రభుత్వం చాల శ్రద్ధగా తెలుసుకోడం అవసరం. మన రాయబారులు, దౌత్య ప్రతినిధులు యీ దేశాల్లోని ట్రేడ్‌యూనియన్ నాయకులతో చాల సన్నిహిత సంబంధాలు పెట్టుకోవాలి."

ఇలాంటి కుట్రలను ఉత్తరోత్తరా అమెరికన్ కార్మికవర్గం పటాపంచ లొనర్చగలదనీ, అమెరికన్ పాలకుల తాబేదార్లుగా ఉపయోగపడ్డానికి కార్మికవర్గం నిరాకరిస్తుందనీ మన విశ్వాసం.

జాతీయ స్వాతంత్ర్యాన్ని డిమాండుచేసే ట్రేడ్‌యూనియన్లు ఐ. సి. ఎఫ్. టి. యు. విధానాన్ని వలసవిముక్తి పోరాటాని కనుకూలంగా మార్చేటందుకు, మాటల్లోనేకాక చేతల్లోకూడ దాని నాయకులు వలసవిధానాన్ని వ్యతిరేకించేటట్లు చేయడానికి తీవ్రంగా కృషిచేస్తాయని ఆశిద్దాం.

ఐ. సి. ఎఫ్. టి. యు. కు అనుబంధింపబడిన సంస్థలు వలస విధానానికి వ్యతిరేకంగా సల్పే పోరాటంలో ప్రపంచ ట్రేడ్ యూనియన్ ఫెడరేషన్‌తోను, దానికి అనుబంధింపబడిన సంఘాల తోను, ట్రేడ్‌యూనియన్లన్నిటితోను స్నేహ సంబంధాలను పెంపొందించుకోగలవనీ వాటితో సహకరించి పనిచేయగలవనీ విశ్వసిద్దాం.



# 5

# వలస విముక్తి పోరాటాల్లో ట్రేడ్‌యూనియన్ల కర్తవ్యాలు

స్వాతంత్ర్యంపొందని దేశాల్లో ఉత్తరోత్తరా కార్మికుల కష్టాలకు, ప్రజల బాధలకు కారణం వలస విధానం గనుక వలస విధానానికి వ్యతిరేకంగా, జాతీయ స్వాతంత్ర్యంకొరకు పోరాడ్డం ఆ దేశాల్లో కార్మికుల, ట్రేడ్‌యూనియన్ల ప్రధాన కర్తవ్యం. ఈమధ్యనే స్వాతంత్ర్యంపొందిన దేశాల్లో సైతం యిది దీర్ఘకాల కర్తవ్యంగా ఉంటుంది. దీన్ని నిర్వర్తించడం కష్టమనడంలో సందేహంలేదు. స్వాతంత్ర్యం సిద్ధిస్తే కార్మికులు, ప్రజలు తమ దేశాలను తాము నిర్మించుకోటానికి, తమ స్థితిగతులను బాగుపరచుకోడానికి కావలసిన ప్రాతిపదిక ఏర్పడుతుంది. ఐతే, యీ దేశాల్లోని జాతీయార్థిక వ్యవస్థలో గణనీయమైన భాగం యింకా వలస రాజ్యాధిపతుల చేతుల్లోనే ఉంది. ఒక్కొక్కప్పుడు యేదో ఒక రకమైన రాజకీయ బంధనంకూడా ఉంటుంది. అది వలస రాజ్యాధిపతులతో దేశాన్ని బంధించి ఉంచుతుంది. అందుచేత కార్మికుల ఆర్థిక సాంఘిక పరిస్థితులు తగినంతగా బాగుపడవు.

అందుచేతనే కార్మికవర్గం యీ దేశాల్లో ఆర్థికరాజకీయాది రంగాల్లో వలస విధాన అవశేషాలను నిర్మూలించడానికి, జాతీయ స్వాతంత్ర్యాన్ని పటిష్ఠ మొనర్చేటందుకు వలస విముక్తి పోరా

టాన్ని తీవ్రతరం చేయవలసి వుంటుంది. అదే సమయంలో కార్మికవర్గం, ట్రేడ్‌యూనియన్లు జాతీయార్థిక వ్యవస్థను నిర్మించేటందు కవసరమైన చర్యలను సర్వవిధాలా బలపరచవలసి యుంటుంది. కారణ మేమంటే, రాజకీయ స్వాతంత్ర్యాన్ని కాపాడుకొనేందుకు, కార్మికుల - ప్రజల స్థితిగతులను చక్కబరచుకొనేందుకు యిది చాల అవసరం.

ట్రేడ్‌యూనియన్లు ఒకవైపు వలసవిధానానికి వ్యతిరేకంగాను, జాతీయ స్వాతంత్ర్యంకొరకు సర్వవిధాల కృషిచేస్తూనే, మరోవైపు కార్మికుల తక్షణ ప్రయోజనాలను కాపాడేవిషయంలో శ్రద్ధతీసుకోవలసి యుంటుంది. ఎందుచేతంటే, ప్రజాసామాన్యం వలసవిధానాన్ని రద్దుచేయాలని కోరడంతోపాటు తమ స్థితిగతులు బాగుపడాలని కూడా కోరుతారు. కార్మికుల ప్రయోజనాలను రక్షించడం ఎల్లప్పుడూ ట్రేడ్‌యూనియన్ ఉద్యమంయొక్క కర్తవ్యంగా ఉండాలి.

కార్మికుల ప్రయోజనాలను కాపాడే విషయంలో ట్రేడ్‌యూనియన్ ఉద్యమం నిర్వర్తించవలసిన కర్తవ్యాలను వివిధ దేశాల పరిస్థితుల్నిబట్టి రూపొందించుకోవాలి. అయితే, అన్ని దేశాలకూ వర్తించే కొన్ని ఉమ్మడివిధులను మనం పేర్కొనవచ్చు:

—కార్మికుల స్థితిగతులపై వలసవిధానంయొక్క దుష్ఫలితాలను నిర్మూలించడం;

—జీతాల పెంపుదలను, కనీస వేతనాల్ని సాధించడం;

—నిరుద్యోగానికి వ్యతిరేకంగా పూర్తి ఉద్యోగసౌకర్యాల కొరకు పోరాటం;

—ధరలు స్థిరంగా నిలబడేటట్లు చేయడం; వాటి పెరుగుదల కనుగుణ్యంగా జీతాలను పెంచడం;

—పనియొక్క వేగాన్ని హెచ్చించే రేషనలైజేషన్ చర్యలను వ్యతిరేకించడం; బర్తరఫులను అరికట్టడం;

—పూర్తియైన ప్రజాస్వామ్యహక్కులను, ట్రేడ్‌యూనియన్ హక్కులను సాధించుకోడం;

—సాంఘిక భద్రతకు సంబంధించిన స్కీములను ప్రవేశపెట్టేటట్లు, ఉన్నవాటిని మెరుగుపరచేటట్లు చూడ్డం; వాటి నిర్వహణలో ట్రేడ్‌యూనియన్లు పాల్గొనేటట్లు చూడ్డం;

—కార్మికచట్టాలను ప్రవేశపెట్టేటట్లు చూడ్డం; వాటిని తయారుచేయడంలోను, అమలుజరపడంలోను ట్రేడ్‌యూనియన్లు ప్రత్యక్షంగా పాల్గొనడం;

—ఇండ్ల వసతిని మెరుగుపరచడం.

కొన్ని దేశాల్లో మరికొన్ని డిమాండ్లనుకూడా వీటికి చేర్చవలసియుంటుంది. ఉదాహరణకు :

—జాతివిచక్షణను రద్దుచేయడం;

—సమానమైన పనికి సమానవేతనా లివ్వడం (స్త్రీలకు పురుషులకు సమానంగా);

—రంగుజాతి కార్మికులుకూడా వృత్తివిద్యలలో శిక్షణ పొందే హక్కు; అర్హతకు తగిన పనిని పొందేహక్కు.

ట్రేడ్‌యూనియన్ ఉద్యమం వలసవిధానానికి వ్యతిరేకంగాను, కార్మికప్రయోజనాలను రక్షించేటందుకు పోరాడేటప్పుడు ఒక ముఖ్యమైన సమస్యను ఎదుర్కోవలసి యుంటుంది. అది ట్రేడ్‌యూనియన్లకూ జాతీయ పెట్టుబడిదారీవర్గానికీ మధ్య ఉండవలసిన సంబంధం. ఈమధ్యనే స్వాతంత్ర్యంపొందిన దేశాలలో ఆర్థిక రాజకీయాధికారం తరచు జాతీయ పెట్టుబడిదారీ వర్గం చేతుల్లో ఉంటుంది. స్వాతంత్ర్యం యింకా సంపాదించని దేశాల్లో జాతీయ పెట్టుబడిదారీవర్గం తరచు జాతీయ స్వాతంత్ర్యోద్యమంలో ఒక ప్రధానశక్తిగా ఉంటుంది. జాతీయ పెట్టుబడిదారీవర్గం తీసుకొనే చర్యలు సామ్రాజ్యవాదాన్ని దెబ్బకొట్టేవిగాను, దేశస్వాతంత్ర్యాన్ని పటిష్ఠమొనర్చేవిగాను, పారిశ్రామికాభివృద్ధికి తోడ్పడేవిగాను ఉన్నంతకాలం వాటిని

ట్రేడ్ యూనియన్ ఉద్యమం బలపరచాలి; వాటిని అమలుజరప డంలో ప్రత్యక్షపాత్ర వహించాలి.

ఐతే జాతీయ పెట్టుబడిదారీవర్గం ద్వంద్వ స్వభావం గలది. ఒకవైపు అది దేశభక్తియుత సామ్రాజ్య వ్యతిరేక శక్తి; రెండో వైపు తన స్వార్థపూరితమైన సంకుచిత ప్రయోజనాలనుకాపాడు కోడానికి అది ఉత్సాహాల పడుతుంది. అందుచేత అది సామ్రాజ్య వాదాన్ని వ్యతిరేకించడంలో సంకోచించే ధోరణిని, ఊగిసలాడే ధోరణిని ప్రదర్శిస్తుంది. ముఖ్యంగా పెద్దపెద్ద జాతీయ గుత్త పెట్టు బడిదార్లు యీ విధంగానే వ్యవహరిస్తారు. వారు తమ జేబులు నింపుకోడానికి కార్మికుల ప్రయోజనాలను, ప్రజల హక్కులను కాలరాయడానికి సర్వవిధాలా ప్రయత్నిస్తారు. అందుచేత ట్రేడ్ యూనియన్ ఉద్యమం సామ్రాజ్యవాదులకు వ్యతిరేకంగా జాతీయ ప్రయోజనాలను కాపాడ్డానికి, వాటిని మరింత విస్తృత పరచడానికి జాతీయ పెట్టుబడిదారీ వర్గంలోని సామ్రాజ్య వ్యతి రేక శక్తుల్ని బలపరచవలసి యుంటుంది. ఐతే ట్రేడ్ యూనియన్లు కార్మికుల హక్కులను కాపాడ్డానికి, వాటిని విస్తృతపరచడానికి జాతీయ పెట్టుబడిదారీవర్గం యొక్క స్వార్థపూరిత చర్యలను, కార్మికుల్ని పీడించే విధానాన్ని వ్యతిరేకించవలసి యుంటుంది. ముఖ్యంగా జాతీయ పెట్టుబడిదారీవర్గం సామ్రాజ్యవాదుల విష యంలో ఊగిసలాడే ధోరణిని, రాజీచేసుకొనే పోకడను బహిర్గతం చేయవలసి యుంటుంది; వీటికి వ్యతిరేకంగా పోరాడవలసి యుంటుంది. అట్టి రాజీలు జాతీయప్రయోజనాల దృష్ట్యా అవసర మని జాతీయ పెట్టుబడిదార్లు సమర్థించుకుంటారు. జాతీయ పెట్టు బడిదారీవర్గం యెడల ట్రేడ్ యూనియన్లు ఈ విధంగా రెండు రకా లయిన వైఖరిని ప్రదర్శించవలసి యుంటుంది. వాటి మధ్య సహ జంగా వైరుధ్యం ఉంటుంది. ఈ వైరుధ్యాన్ని చక్కగా అర్థం చేసుకొని సవ్యంగా పరిష్కరిస్తేనే వలస విముక్తి పోరాటం పురోగమించడం, ట్రేడ్ యూనియన్ ఉద్యమం బలపడ్డం సాధ్యం.

ఇట్టి పరిస్థితుల్లో ట్రేడ్‌యూనియన్లు తమ కోర్కెలను సాధించుకోడంతోపాటు ఆర్థిక వ్యవహారాల్లో కొన్ని కర్తవ్యాలను నిర్వర్తించవలసిన అవసరంకూడ ఉండదా అని ఆలోచించవలసి యుంటుంది.

స్వాతంత్ర్యంపొందిన దేశాల్లోని ప్రత్యేక పరిస్థితుల్ని బట్టి, ప్రజాస్వామ్యహక్కుల హెచ్చుతగ్గులనుబట్టి, కార్మికోద్యమం యొక్క బలాన్నిబట్టి ఆ దేశాల ఆర్థికాభివృద్ధికి కావలసిన ప్రణాళిక లను తయారుచేయడంలోను, వాటిని అమలుజరపడంలోను ట్రేడ్ యూనియన్లు సర్వవిధాల పాల్గొనవలసి యుంటుంది. అంతేకాదు. వలసవిధాన అవశేషాలను నిర్మూలించడానికి, దేశంయొక్క వెనుక బాటుతనాన్ని అధిగమించడానికి తీసుకోబడే చర్యలలో లంచగొండి తనం, దుబారా మొదలైనవాటిని అరికట్టవలసి యుంటుంది; ఇందుకు ట్రేడ్‌యూనియన్లు ప్రజాస్వామ్యయుత చొరవను పెంపొందించుకోవాలి. ముఖ్యంగా జాతీయ యాజమాన్యంక్రింద ప్రారంభింపబడి ప్రజలనుండి పన్నులరూపంలో వసూలుచేయబడిన ధనంతో నిర్మింపబడిన సంస్థల కిది చక్కగా వర్తిస్తుంది. ట్రేడ్ యూనియన్లు జాతీయసంపదను కాపాడేటందుకు, ప్రజల జీవితానిక, దేశం అభివృద్ధికీ అవసరమైన సంస్థలను రక్షించడానికి ప్రజాస్వామ్య యుతమైన చొరవను ప్రదర్శించాలి. అంతేగాక, విదేశీ గుత్త పెట్టుబడిదార్లు, వారి స్నేహితులు కొత్తగా స్వాతంత్ర్యంపొందిన యీ దేశాల వలసవిధానాన్ని రూపుమాపడానికి ముందుకు వెళ్ళడం చూడలేక, పైవిధమైన సంస్థలను దుర్వినియోగించడానికి, వాటితాలూకు ధనాన్ని అపహరించడానికి, వాటిని ధ్వంసమొనర్చ డానికి, లేదా విచ్ఛిన్నంచేయడానికి పూనుకోవచ్చు. అలాంటి ప్రమాదంఉన్న సంస్థలను కాపాడ్డం ట్రేడ్‌యూనియన్ల కర్తవ్యం.

ట్రేడ్‌యూనియన్ ఉద్యమం యీ కర్తవ్యాలను నిర్వర్తిస్తూ కార్మికుల ప్రయోజనాలను కాపాడగలిగితే, దేశంయొక్క ఆర్థిక వ్యవస్థను నిర్మించడానిక, పెట్టుబడిదార్ల ప్రయోజనాలనుమాత్రమే

కాక ప్రజలందరి ప్రయోజనాలను కాపాడ్డానికీ మొత్తం జాతిఅంతా కార్మికవర్గంతో సమైక్యమయేటట్లు చూడగల్గుతుంది. "పెట్టుబడిదార్ల ప్రయోజనాలను మాత్రమే కాక" అని యెందు కనవలసివచ్చిందంటే, వలసవిధానాన్ని ప్రతిఘటించడంలోను, దేశీయార్థిక వ్యవస్థను ప్రణాళికాబద్ధ మొనర్చడంలోను తానే నాయకత్వం వహిస్తున్నట్లు ఆ వర్గం చెప్పుకొంటుంది.

ఇదివరకే స్వాతంత్ర్యం పొందిన దేశాల్లో జాతీయ స్వాతంత్ర్యాన్ని కాపాడ్డానికి, జాతీయార్థిక వ్యవస్థను నిర్మించడానికి జాతీయ పెట్టుబడిదారీవర్గంతోను, దాని ప్రభుత్వంతోను సహకరించేటప్పుడు ట్రేడ్‌యూనియన్లు కార్మికుల హక్కులను రక్షిస్తూ వారి స్థితిగతులను మెరుగుపరుస్తూ ఉండాలి. అనేక సంవత్సరాలు సామ్రాజ్యవాదులక్రింద బానిసత్వం అనుభవించిన యీ దేశాల్లో కార్మికులు అత్యంత కష్టమైన పరిస్థితుల్లో జీవిస్తున్నారు. అటువంటప్పుడు, కార్మికుల స్థితిగతులను వెంటనే మెరుగుపరచేటందుకు, వారి న్యాయమైన హక్కులను కాపాడేటందుకు తగు శ్రద్ధ తీసుకోనిదే, సామ్రాజ్య వ్యతిరేకపోరాటంలోను, ఆర్థిక వ్యవస్థను పటిష్ఠమొనర్చడంలోను కార్మికవర్గం అత్యంత విస్తృతంగా కార్యాచరణకు పూనుకొనేటట్లు చేయలేకపోతాం.

అందుచేత జాతీయ పెట్టుబడిదారీవర్గం, దాని ప్రభుత్వం కార్మికుల ఆర్థిక సాంఘిక పరిస్థితులను మెరుగుపరచేందుకు బాధ్యత తీసుకోవలసి యుంటుంది. కార్మికుల ప్రధానావసరాలను అవి నిర్లక్ష్యం చేస్తేగాని, కష్టజీవుల హక్కుల విషయం పట్టించుకోకుండా ఎంతసేపూ స్వార్థబుద్ధితో వ్యవహరిస్తాంటే గాని ట్రేడ్‌యూనియన్లు వాటికి వ్యతిరేకంగా కార్మికుల్ని సమీకరించి పోరాటం నడపవలసి యుంటుంది. కార్మికుల ప్రయోజనాలను కాపాడనిదే, సామ్రాజ్య వాదానికి వ్యతిరేకంగా జరిగే పోరాటంలోను, దేశాన్ని అభివృద్ధి చేసేందుకు జరిగే కృషిలోను కార్మికులు పాల్గొనేటట్లు చేయలేం.

జాతీయ పెట్టుబడిదారీవర్గం ఊగిసలాడుతూ, సామ్రాజ్య వాదులతో రాజీపడుతూంటే కార్మికవర్గం ఇంకా యెక్కువ దృఢ నిశ్చయంతో పోరాడవలసి యుంటుంది. తిరిగి జాతీయ ప్రయోజ నాల కనుగుణ్యంగా వ్యవహరించేటట్లు చేయవలసి యుంటుంది.

అయితే మనం గుర్తించవలసిన విషయమేమంటే, ఇట్టి పోరాటాల లక్ష్యం కార్మికులయెడ జాతీయ పెట్టుబడిదారీవర్గం అనుసరించే అపసవ్య వైఖరిని మార్చేదిగా ఉండాలి; ఆ వర్గంతో మన సామ్రాజ్య వ్యతిరేక సహచర్యం మెరుగుపడేటట్లు ఉండాలి. అందుచేత జాతీయ పెట్టుబడిదారీవర్గం యెడల మన వ్యతిరేకత సామ్రాజ్య వ్యతిరేక ఐక్యసంఘటనలో ప్రధాన చీలికకు కారణం కాకూడదు; ఆ విధంగా మన ప్లాను ఉండాలి. ఇట్టి పోరాటాల్లో జాతీయ పెట్టుబడిదారీవర్గం సామ్రాజ్యవాదం యెడల, కార్మికులయెడల అనుసరించే వైఖరికూడా నిర్ణయాత్మక మైన విషయమే నన్న విషయం మరచిపోకూడదు.

ఇంకా స్వాతంత్ర్యంపొందని దేశాల్లోని జాతీయ పెట్టుబడి దారీవర్గంయెడల కూడ యిలాంటి విధానమే సహజంగా అవలం బించవలసి యుంటుంది. ఐతే, వలస రాజ్యాధిపత్యంమూలంగా యీ దేశాల్లో అత్యధికసంఖ్యాక సంస్థలు వలస రాజ్యాధిపతుల యాజ మాన్యంక్రింద ఉన్నాయి. అట్టి సంస్థలలో కార్మికులు తమ ఆర్థిక-సాంఘిక స్థితిగతులను మెరుగుపరచుకోడానికి సాగించే ప్రతి పోరాటం వలస వ్యతిరేక స్వభావాన్ని కలిగియుంటుంది. ఈ దేశాల్లో ట్రేడ్‌యూనియన్ ఉద్యమంయొక్క కర్తవ్యం కార్మికుల ఆర్థిక పోరాటాలను వలస విధానానికి వ్యతిరేకంగా జరిగే రాజ కీయ పోరాటాలతో సమన్వయపరచడం. అప్పుడు కార్మికుల చైతన్యాన్ని ఎప్పటికప్పుడు అభివృద్ధి చేయగల్గుతాం; వలస రాజ్యాధిపతుల్ని తరిమివేయడానికి అవసరమైన పూర్వరంగం తయారుచేసేందుకు జరగవలసిన పోరాటంలో కార్మికుల బలం పెంపొందేటట్లు చూడగల్గుతాం.

ఆసియా, ఆఫ్రికా, లాటిన్ అమెరికాలలో అభివృద్ధి నిరోధ శుల పెత్తనంక్రింద ఉన్న కొన్ని దేశాలు సైనిక కూటములలో యిరుక్కొని ఉన్నాయి; వారు తమ దేశాల స్వాతంత్ర్యాన్నీ, జాతీయ సంపదనూ అమ్మివేస్తున్నారు; సామ్రాజ్యవాదులమీద ఆధారపడుతున్నారు. ఇట్టి దేశాల్లో కార్మికవర్గం, ట్రేడ్‌యూనియన్లు జాతీయ విద్రోహపంథాను దృఢనిశ్చయంతో వ్యతిరేకించడానికి, కార్మికుల ప్రయోజనాలకొరకు పోరాడ్డానికి దేశభక్తియుత వర్గాలన్నిటినీ ఐక్యపరచవలసి యుంటుంది. ప్రజల ఒత్తిడివల్ల యీ ప్రభుత్వాలు జాతీయ స్వాతంత్ర్యానికి, కార్మికుల ప్రయోజనాలకు అనుకూలంగా కొన్ని మార్పులు తీసుకువచ్చినట్లయితే, వాటిని ట్రేడ్‌యూనియన్లు బలపరచాలి, ప్రోద్బలమీయాలి.

ఇదివరకే స్వాతంత్ర్యం పొందిన కొన్ని దేశాలలో విదేశ గుత్తాధిపతుల పెత్తనం యింకా ఉంది; కార్మికు లింకా అతిహీనమైన కూలిరేట్లు మొదలైన దోపిడీపద్ధతులకు లోనవుతున్నారు. అట్టిదేశాల్లో ట్రేడ్‌యూనియన్లు విదేశ గుత్తాధిపతుల అమానుష దోపిడీకి వ్యతిరేకంగా, కార్మికుల స్థితిగతులను తగినంతమేరకు మెరుగుపరచేటట్లు చేయడానికై మరింత దృఢనిశ్చయంతో పోరాడవలసియుంటుంది; దేశీయకార్మికులపట్ల విచక్షణచూపే పద్ధతి నెదుర్కొంటూ మరింత పట్టుదలతో కృషిచేయాలి; సమానపనికి సమానవేతనం అనే సూత్రాన్ని అమలుపరచేటట్లు, దేశీయ కార్మికుల్నీ విదేశకార్మికుల్నీ సమానహోదాతో చూచేటట్లు చేయడానికి మరింత ధైర్యంగా పోరాడాలి; విదేశ గుత్తాధిపతులు సంపాదించే విపరీత లాభాలను ఖండించడంలోను, ప్రజలపై భారం తగ్గించడానికిగాను వాటిలో తయారయే సరకులను తక్కువ ధరలకు విక్రయించాలని డిమాండుచేయడంలోను, అట్టి పరిశ్రమలను జాతీయం చేయాలని ఆందోళన చేయడంలోను మరింత పట్టుదలతో పనిచేయాలి. ఈ పోరాటాల్లో మనం ప్రజల సానుభూతిని, సహకారాన్ని సంపాదించాలి. ఒక్కొక్క సంస్థకు చెందిన విదేశ

గుత్తాధిపతులకు వ్యతిరేకంగా జరిగే పోరాటాన్ని మొత్తం జాతి సాగించే సామ్రాజ్య వ్యతిరేకపోరాటంతో సమన్వయపరచాలి.

కార్మికోద్యమానికి రైతులు, రైతు ఉద్యమానికి కార్మికులు అన్యోన్యంగా సహాయం చేసుకొనేటట్లు కూడ ట్రేడ్ యూనియన్లు చూడాలి.

ఆసియా, ఆఫ్రికా, లాటిన్ అమెరికాలలో రైతులే జనాభాలో అధికభాగం. వారు వలస విధానం క్రింద, ఫ్యూడలిజం క్రింద కూడ అష్టకష్టాలు పడుతున్నారు. వారు కార్మిక వర్గానికి స్వతస్సిద్ధమైన మిత్రులు. ఐతే రైతుల్లో అధిక సంఖ్యాకులింకా సంఘటితులు కాలేదు. వారు తమ సొంత సంఘాలను నిర్మించుకొనేటట్లు ట్రేడ్‌యూనియన్లు సహాయపడాలి; భూమి కోసం, జీవిత సౌకర్యాల కోసం వారు కోరే కోర్కెలను బలపరచాలి; వారితో చేతులు కలిపి నడవాలి. ఇటీవలి సంవత్సరాల్లో కార్మికులు, రైతులు అన్యోన్యంగా సహకరించుకున్న ఉదంతాలు చాలా ఉన్నాయి. అట్టి ఐక్యతను మనం చైతన్య యుతంగా అభివృద్ధి చేసినట్లయితే, వలసవ్యతిరేక పోరాటం యింకా బలపడ్డానికి, కార్మిక ప్రయోజనాల రక్షణకు సహాయం చేసిన వారమవుతాం. అదే సమయంలో ట్రేడ్‌యూనియన్లు స్వతంత్ర రైతు సంఘాల స్థానాన్ని ఆక్రమించకుండా చూడాలి.

ఈ ఖండాలలో అనేక ప్లాంటేషన్లు ఉన్నాయను విషయం, వాటికి యజమానులు వలసరాజ్యాధిపతులనే విషయం మరువకూడదు. సాధారణంగా ప్లాంటేషన్ కార్మికులకు రైతులతో వర్గసంబంధా లుంటాయి. ఇటీవల చాలదేశాల్లోని ప్లాంటేషన్లలో ట్రేడ్‌యూనియన్ ఉద్యమం గణనీయంగా అభివృద్ధిచెందింది. ఇది అనేక దేశాల్లో ట్రేడ్‌యూనియన్ ఉద్యమానికి ప్రత్యేక ప్రాముఖ్యతగల విషయం. ప్లాంటేషన్ కార్మికులలో నిర్మాణకార్య కలాపాలు హెచ్చితే ట్రేడ్‌యూనియన్ ఉద్యమం బలపడ్డమే

కాకుండా, రైతు ఉద్యమానికి, కార్మికోద్యమానికీ మధ్యగల అన్యోన్య సంబంధాలు, పరస్పర సహకారంకూడా బలపడతాయి.

ట్రేడ్ యూనియన్ ఉద్యమం మేధావులతో ముఖ్యంగా విద్యార్థి ఉద్యమంతోను, ఉపాధ్యాయుల ఉద్యమంతోను కూడ సహకరించే విషయమై శ్రద్ధవహించాలి. కార్మిక పోరాటాలు విజయం సాధించడానికి ఇదీ, యితర వర్గాలతో సహకరించడమూ చాల ప్రాముఖ్యం వహిస్తాయి. ఐతే, జాతీయ స్వాతంత్ర్యంకొరకు, కార్మిక ప్రయోజనాలకొరకు జరిగే పోరాటంలో విజయం లభించడానికి నిర్ణయాత్మకమైన అంశం ట్రేడ్ యూనియన్ ఉద్యమంలో ఐక్యత. ఇటీవలి కాలంలో, జాతీయ స్వాతంత్ర్యంకొరకు పోరాడే దేశాల్లో ట్రేడ్ యూనియన్ ఉద్యమాలు ఐక్యతను నిర్మించే విషయమై ఎంతో అభివృద్ధిని సాధించాయి. ఇది వలసవిముక్తి పోరాటానికి, కార్మిక ప్రయోజనాల రక్షణకు తప్పక తోడ్పడుతుంది.

కొన్ని దేశాల్లో యిప్పటికీ ట్రేడ్ యూనియన్ ఉద్యమం విభజింపబడియుంది. ఇందుకు అనేక జటిలమైన కారణా లున్నాయి. కాని ప్రధాన కారణం, యీ దేశాల్లో వలస రాజ్యాధిపతులు లేదా యితర పాలకవర్గాలు అవలంబించే నిర్బంధ విధానం, కవ్వింపు చర్యలు, చీలికలనుతెచ్చే పనులు.

ట్రేడ్ యూనియన్ ఐక్యతను గురించి ఆలోచించేటప్పుడు మనలో ఒక ధోరణి కనిపిస్తుంది. అది కార్మికవర్గం రాజకీయంగా విభజింపబడియున్నంతకాలం ట్రేడ్ యూనియన్లు ఐక్యతను సాధించలేవనేది. కాని అనేక దేశాల అనుభవం మనకు నిరూపించే విషయమేమంటే, కార్మికులలో అధిక సంఖ్యాకులు వేర్వేరు రాజకీయ పార్టీలకు చెందినప్పటికీ ట్రేడ్ యూనియన్ ఐక్యత ఆచరణలో సాధ్యపడుతోంది. కారణమేమంటే కార్మికులు తమప్రయోజనాలను కాపాడుకొనే సందర్భంలో ప్రధానంగా ఒకేవిధమైన కోర్కెలు కోరుతారు. ఒకేవిధమైన రాజకీయాభిప్రాయాలు లేనప్పుడు

సంయుక్త కార్యాచరణ సాధ్యంకాదనీ, ఐక్య ట్రేడ్‌యూనియన్ నిర్మాణం అసంభవమనీ చెప్పడంసరికాదు.

కాని చీలికలున్నప్పుడు ఐక్యత సులభంగా సిద్ధించదు. జాతీయ ప్రయోజనాలకు, కార్మికుల వర్గప్రయోజనాలకు అనుగుణ్యంగాఉండే ఉమ్మడికోర్కెలు ఐక్యతకు మొట్టమొదట ప్రాతిపదికగా ఉండాలి. ఇది ఐక్యతకు భౌతిక ప్రాతిపదిక.

ఐక్యత అనేది ప్రజల ప్రత్యక్షచర్యలలో వ్యక్తమవుతుంది. ముఖ్యంగా పోరాటాలు జరుగుతున్నప్పుడు సాధారణ కార్మికుల మధ్య ఐక్యకార్యాచరణకు మనం ప్రాముఖ్యత నివ్వాలి. ఒక్కొక్కప్పుడు సాధారణ కార్మికులమధ్య ఐక్యత పైకమిటీల వైఖరిలో మార్పుతీసుకురావచ్చు. కాని రెండోవైపునకూడా పైకమిటీలమధ్య, ట్రేడ్‌యూనియన్ నాయకుల మధ్య అన్యోన్యసంబంధాలుంటే, కొంతవరకు ఉపయోగం కలుగవచ్చు. ఎందువల్లనంటే కార్మికుల్లో వారికి కొంతపలుకుబడి ఉంటుంది. పైకమిటీలలోను, నాయకుల మధ్య అన్యోన్య సుహృద్భావం ఉన్నట్లయితే కార్మికులమధ్య ఐక్యత తీసుకురావడంలో కష్టం తగ్గుతుంది. అందుచేత మనం కార్మికుల్లోను, నాయకుల్లోనుకూడా ఐక్యతకోసం కృషిచేయవలసి యుంటుంది. అప్పుడు ఒకదాని కొకటి సహాయకారిగా ఉంటుంది. ఈ రెండిటిలో దేన్ని నిర్లక్ష్యంచేసినా ఐక్యతను సాధించడం కష్టం.

ఐక్యతకొరకు పనిచేసేటప్పుడు సమష్టి కార్యక్రమం, సక్రమ పంథాతోపాటు సరియైన పద్ధతులుకూడా అవసరం. అన్యోన్య గౌరవం, సమానహోదాఅనేవి యీ విధానానికి ప్రాతిపదికలు. వివిధ సమస్యలనుగురించి ఆలోచించేటప్పుడు అల్పసంఖ్యాకులకు ప్రాతినిధ్యంవహించే యూనియన్ మొత్తం కార్మికుల ప్రయోజనాలను దృష్టిలో ఉంచుకోవాలి. అధికసంఖ్యాకులకు ప్రాతినిధ్యం వహించేది అల్పసంఖ్యాకుల ప్రయోజనాలను దృష్టిలో ఉంచుకోవాలి.

ట్రేడ్‌యూనియన్ల మధ్య అనివార్యమైన భేదాభిప్రాయాలున్నప్పటికి ఎడతెగని చర్చలద్వారాను, సంప్రదింపులద్వారాను ఏకాభిప్రాయాన్ని సాధించగలగాలి. ఏ సమస్యలపై ఏకాభిప్రాయం సాధ్యపడదో ఆ సమస్యలను దూరంగా ఉంచవచ్చు. తర్వాత ఆ అంశాలమీదకూడ ఏకాభిప్రాయానికి రాగల్గుతాం. కారణమేమంటే, కార్మికులెల్లప్పుడూ ముందుకు సాగుతూఉంటారు; పరిస్థితులెప్పుడూ మారుతూఉంటాయి.

కార్మికుల ప్రయోజనాలకు, జాతీయ ప్రయోజనాలకు సంబంధించిన కీలక సమస్యలు మనలనెదుర్కొన్నప్పుడు, అభిప్రాయ భేదాలు ఉత్పన్నమైనప్పుడు యితరులతో మనం చర్చించవచ్చు; అలా చర్చించాలికూడా. విమర్శన - ఆత్మవిమర్శనలకు మనం పూనుకోవాలి. ఐతే విమర్శన నిష్కల్మషంగా జరగాలి; ఓపికతో చేయాలి. అంతేకాదు; విమర్శన హేతుబద్ధంగాను ద్వేషరహితంగాను ఉండాలి; ఇతరుల హృదయాలకు అది బాధకలిగించకూడదు. మనతో భేదించే వారి అభిప్రాయాలను మనం ఓపికతో వినాలి. వాటిలో ఏ మాత్రపు హేతువాదం ఉన్నా దాన్ని మనం గుర్తించాలి. క్లుప్తంగా చెప్పాలంటే, యిలాంటి చర్చల తర్వాత ఐక్యత మరింత పటిష్ఠమయేటట్లు, విస్తరించేటట్లు చూడాలి. కనీసం అదివరకున్న ఐక్యతకు నష్టం కలుగనివిధంగా యీ చర్చలు జరగాలి.

ట్రేడ్‌యూనియన్లు కొన్ని సమస్యలమీద ఒడంబడికకు రావడానికి కలిసి కూర్చోవడం, సంప్రతింపులు జరుపుకోవడం అవసరం. ఐతే ఐక్యతకొరకు సాగే ఉద్యమాన్ని ముందుకు తీసుకు వెళ్ళాలంటే, యింతటితోనే మనం ఆగిపోకూడదు. ఉమ్మడి అభిప్రాయాల ప్రాతిపదికమీద మనం సమష్టి కార్యాచరణకు పూనుకోవాలి. స్థానికమైన, లేదా తాత్కాలికమైన ఐక్య కార్యాచరణ క్రమంగా విస్తృత కార్యాచరణకు లేదా శాశ్వత కార్యాచరణకు

దారి తీయవచ్చు. పరిస్థితులు ఆ దశకువస్తే తర్వాత ఏమిచేయాలో ఆలోచించుకోవచ్చు.

ట్రేడ్ యూనియన్ ఉద్యమంలో ఐక్యత ఎంతో ప్రధానమైన విషయం, దానికొరకు కృషిచేయడం చిక్కులతోకూడిన పని. అందుచేత ప్రపంచ ట్రేడ్‌యూనియన్ ఫెడరేషన్‌కి అనుబంధింపబడిన సంస్థలు, స్నేహంగాఉండే సంస్థలు యీ విధంగా కృషి చేయడానికి, ఇంకా యెక్కువ బాధ్యతలు తీసుకోడానికి పాటుపడవలసి యుంటుంది.

జాతీయ స్వాతంత్ర్యంకొరకు పోరాడే దేశాలలో ట్రేడ్ యూనియన్లు శాంతి ఉద్యమంలో మరింత చురుగ్గా పాల్గొనవలసి యుంది. సామ్రాజ్యవాదులు యుద్ధాన్ని గురించీ, యుద్ధసన్నాహాలను గురించీ తెగమాట్లాడుతున్నారు. వారు యితర దేశాలలోని శాంతికాముక ప్రజల్నేకాక, స్వాతంత్ర్యంకొరకు పోరాడే ప్రజల్నికూడ బెదిరిస్తున్నారు. రెండోవైపు బెదరింపులద్వారా తమ వలసరాజ్యాధిపత్యాన్ని నిలబెట్టుకొన జూస్తున్నారు. అంతేకాదు; సైనిక స్థావరాలు, సైనికకూటములు, సైనికసహాయం మొదలైన వాటిద్వారా సామ్రాజ్యవాదులు కొత్తరకమైన వలసరాజ్యాధిపత్యాన్ని ప్రవేశపెట్ట జూస్తున్నారు. కార్మికులు శాంతిసాధనకు, తమ ప్రయోజనాల రక్షణకు గల సంబంధాన్ని స్పష్టంగా అర్థం చేసుకునేటట్లు ట్రేడ్ యూనియన్లు ప్రస్తుత అంతర్జాతీయ పరిస్థితిని వివరించాలి. శాంతిరక్షణ పోరాటంలో ట్రేడ్‌యూనియన్లు ప్రజలకు నాయకత్వం వహించాలి. అనగా ఆటం, హైడ్రోజన్ బాంబులకు వ్యతిరేకంగాను, సైనిక స్థావరాలకు వ్యతిరేకంగాను, విదేశీసేనలకు వ్యతిరేకంగాను, ఆయుధాల పోటీకి, యుద్ధ సన్నాహాలకు వ్యతిరేకంగాను పోరాడ్డంలో అగ్రగామి పాత్ర వహించాలి.

ఈ రోజున వలసవిధానం అమెరికా నాయకత్వంక్రింద ఉన్న అంతర్జాతీయ గుత్తాధికారసంస్థల చేతుల్లోఉంది. వారే వలస బానిసల యజమానులు; వారికి వ్యతిరేకంగానే పెట్టుబడిదారీ

దేశాల్లోని కార్మికవర్గం పోరాడుతూంది. సోషలిస్టుదేశాలలోకూడ కార్మికులు సాగిస్తున్న శాంతియుత నిర్మాణానికి బద్ధశత్రువులువారే. అందుచేత వలసవిముక్తికై పోరాడే పీడితప్రజలు సోషలిస్టుదేశాల లోని, పెట్టుబడిదారీ దేశాలలోని కార్మికులకు అండగా నిలబడాలి. ఇది కేవలం స్వాతంత్ర్యంకొరకు పోరాడే దేశాలలోని కార్మికవర్గం, ట్రేడ్‌యూనియన్లు నిర్వర్తించవలసిన కర్తవ్యమేకాదు; పెట్టుబడి దారీ దేశాలలోను, సోషలిస్టు దేశాలలోని కార్మికవర్గం, ట్రేడ్ యూనియన్లు నిర్వర్తించవలసిన ఉమ్మడికర్తవ్యం ఇది. ముఖ్యంగా, పెట్టుబడిదారీ దేశాల్లోని కార్మికులు వలసవిధానానికి వ్యతిరేకంగా జరిగే పోరాటంలో చురుగ్గాపాల్గొంటే, అది మొత్తం పోరాటాన్ని సమన్వయపరచడంలోను, విజయాన్ని సాధించడంలోను దోహద కారిగా ఉంటుంది. ఇది పెట్టుబడిదారీ దేశాలలోని కార్మికుల ప్రయోజనాలకు, శ్రామికవర్గ అంతర్జాతీయతకు పూర్తిగా అనుగుణ్యమైన విధానం.

పైన పేర్కొన్నట్లు జాతీయస్వాతంత్ర్యంకొరకు పోరాడే వివిధదేశాలమధ్య స్నేహం, సంఘీభావం యిటీవలికాలంలో బాగా అభివృద్ధిచెందాయి. వాటికీ, పెట్టుబడిదారీ సోషలిస్టుదేశాలలోని ట్రేడ్‌యూనియన్లకూ మధ్యకూడా సత్సంబంధాలు పెంపొందుతున్నాయి. ఐతే మనం యింతవరకు లభించిన విజయాలతోనే సంతృప్తిపడి ఊరుకోలేం. వివిధదేశాల ట్రేడ్‌యూనియన్ల మధ్య గల స్నేహాన్ని మరింత పటిష్ఠమొనర్చుకోవాలి; మరింత విస్తృత పరచుకోవాలి. వలసవిధానానికి వ్యతిరేకంగా జాతీయ స్వాతంత్ర్యం కొరకు పోరాడేదేశాలలోని ట్రేడ్‌యూనియన్ ఉద్యమాన్ని మరింత చక్కగాసమన్వయపరచాలి; మరింతగా దానికి తోడ్పడాలి.

అంతేకాక, జాతీయ స్వాతంత్ర్యంకొరకు పోరాడే దేశాల్లో ట్రేడ్‌యూనియన్లు నిర్మాణ పద్ధతులలోను, ఎత్తుగడలలోను ఎంతో అనుభవం సంపాదించినప్పటికీ, యింకా ఎక్కువ అనుభవం వాటికి అవసరం. ఈ విషయంలో అనేక సంవత్సరాల పోరాటానుభవం

గల దేశాల ట్రేడ్‌యూనియన్లు మిగతావాటికన్న ఎక్కువ బాధ్యతలను నిర్వర్తించవలసియుంటుంది.

వలస విధానానికి వ్యతిరేకంగా జాతీయ స్వాతంత్ర్యంకొరకు పోరాడే దేశాలలో ట్రేడ్‌యూనియన్ ఉద్యమాలను బలపరచే టందుకు ప్రపంచ ట్రేడ్‌యూనియన్ ఫెడరేషన్ గణనీయమైన సహాయం చేసింది. ఇకముందు అది సుహృద్భావ చర్యలను సంఘటిత పరచడంలో, సమన్వయ పరచడంలో, అంతర్జాతీయ స్నేహ సంబంధాలను అభివృద్ధి చేయడంలో, ఒకరి అనుభవాల నొకరు తెలుసుకోవడంలో తన పాత్రను మరింత పటిష్ఠంగా నిర్వహిస్తుంది.

ఐక్యరాజ్య సమితిలోను, అంతర్జాతీయ కార్మిక సంస్థలోను (ఐ. ఎల్. ఓ.) జాతీయ స్వాతంత్ర్యంకొరకు పోరాడే దేశాలలోని కార్మికుల ప్రయోజనాలను కాపాడేటందుకు ప్రపంచ ట్రేడ్‌యూనియన్ ఫెడరేషన్ యికముందుకూడా తన కృషిని కొనసాగిస్తూ ఉంటుంది.

ప్రస్తుతం అత్యంత ప్రధానమైన విషయమేమంటే, ఐసెన్‌హోవర్ సిద్ధాంతానికి వ్యతిరేకంగాను, తదితర కొత్త లేదా పాతరూపాల్లో ప్రత్యక్షమవుతున్న వలసవిధానానికి వ్యతిరేకంగాను పోరాడ్డానికి ప్రపంచ ట్రేడ్‌యూనియన్ ఫెడరేషన్, అన్ని దేశాల కార్మికసంస్థలు మరింత శక్తివంతమైన చర్యలు తీసుకోవలసియుంది.

కోట్లాదిప్రజలను పీడించుకుతినే వలసవిధానం యావత్తూ ఈరోజున అవసానదశలో ఉంది. పైన మనం చూచినట్లు అత్యంత ప్రాచీనమైన దేశాలు, సహజసంపదలు మనుష్యశక్తి అపారంగా ఉన్న దేశాలు స్వతంత్రంగా అభివృద్ధి చెందడానికి తమ మార్గంలో తాము నడుస్తున్నాయి. మొత్తం సామ్రాజ్యవాద వ్యవస్థనే కూల్చదోస్తున్నాయి. తప్పించుకొనే మార్గమేదీ సామ్రాజ్య వాదానికి లేదు. యుద్ధంద్వారాగాని, యుద్ధపు బెదరింపులద్వారా గాని అది తప్పించుకోడం అసాధ్యం.

ఈనాడు మొత్తం మానవజాతి ఒక బ్రహ్మాండమైన పరివర్తన దశలో ఉంది. అణుశక్తిలో అనంతమైన అవకాశాలున్నాయి; ఎన్నో సరికొత్త సాంకేతిక పద్ధతులు కనిపెట్టబడ్డాయి. వీటి సహాయంతో మానవజాతి దారిద్ర్యంలేని, దోపిడీలేని, బండ చాకిరీలేని, ద్వేషమూ, దౌర్జన్యమూలేని నూతనజీవితం గడపడాని కవకాశా లున్నాయి. ప్రజాస్వామ్యయుతమైన, సౌఖ్యవంతమైన, ఐశ్వర్యంతో కూడిన, సాంస్కృతిక సంపదగల్గిన, శాంతియుతమైన నూతన జీవితం గడపడానికవకాశాలున్నాయి.

ఇందుకు వలసవిధాన నిర్మూలన ఒక సోపానం. వలస విధానాన్ని మనం కూకటివేళ్ళతో కూల్చివేసిననాడు అనేక శతాబ్దాల కాలంలో మానవుడుచేసిన కృషిఫలితంగా లభించిన శాస్త్రవిజ్ఞానం, సాంకేతిక పద్ధతులు మానవుని నిర్మూలనకు కాకుండా, యుద్ధాలకొరకు కాకుండా మానవుని సౌఖ్యంకొరకు వినియోగింపబడతాయి. అప్పుడుగాని మానవజాతి ముందడుగు వేయజాలదు. పూర్వంఒక మ్లేచ్ఛదేవత ఉండేదట. ఆమె హత్య చేయబడినవాని పుర్రెతోగాని అమృతం సేవించేదికాదట. మానవ జాతి అటువంటి దేవత మాదిరిగా పురోగమించవలసినగతి యిక పట్టదు.





# కొన్ని ట్రేడ్ యూనియన్ సంస్థల పేర్లు



1. ఐ. సి. ఎఫ్. టి. యు. = ఇంటర్నేషనల్ కాన్ఫెడరేషన్ ఆఫ్ ఫ్రీ ట్రేడ్ యూనియన్స్.
2. ఐ. ఎఫ్. సి. టి. యు. = ఇంటర్నేషనల్ ఫెడరేషన్ ఆఫ్ క్రిస్టియన్ ట్రేడ్ యూనియన్స్.
3. యు. జి. టి. ఎ. ఎన్. = యూనియన్ ఆఫ్ జనరల్ ట్రేడ్ యూనియన్స్ ఆఫ్ నార్త్ ఆఫ్రికా.
4. సి. జి. టి. = కాన్ఫెడరేషన్ ఆఫ్ జనరల్ ట్రేడర్స్.
5. సి. యు. టి. సి. హెచ్. = సెంట్రల్ యునైటెడ్ ట్రేడ్ యూనియన్స్ ఆఫ్ ఛిలీ.
6. ఎ. ఎఫ్. ఎల్. – సి. ఐ. ఓ. = అమెరికన్ ఫెడరేషన్ ఆఫ్ లేబర్ అండ్ కాంగ్రెస్ ఆఫ్ ఇండస్ట్రియల్ ఆర్గనైజేషన్స్.

## Check List

| | | | |
|---|---|---|---|
| Book Number | PSL01B256 | Date | 15/11/22 |
| Front Cover | ye | Back Cover | no |
| Blank Pages | ii, 4 | | |
| Missing Pages | NO | | |
| Prepared By | Hema | Cutting By | Hema |
| Scanned By | Mounika | Pages | 101 |